# ఆసామి

(నాటకం)





రచన:
నాజర్



నగారా ప్రచురణాలయం,
కొత్తపేట, :: గుంటూరు.

# ఆసామి

(నాటకం)





రచన :

నాజర్



నగారా ప్రచురణాలయం
గుంటూరు

CIV 2ు/56

# పరిచయం

బుర్రకథల్ని రచించడంలో గానంచెయ్యడంలో వొక నవ్యశకం ప్రవేశపెట్టిన విశిష్ట కళాకారుడు చిరంజీవి నాజరు. ఇతణ్ణి వొక నాటకకర్తగా తెనుగుదేశానికి తొలిసారిగా పరిచయం చెయ్యగల అపూర్వఅవకాశం లభించడం నాకు హర్ష కారణం.

ఈ నాటకం 18 వ ఆంధ్రనాటక కళాపరిషత్తులో ప్రథమ బహుమానం పొందింది. తర్వాత అనేకచోట్ల ప్రదర్శింపబడింది. ఆ ప్రదర్శనలుచూచి ఆనందించిన వేలాది ప్రేక్షకులకు ఈ నాటకాన్నిగురించి కొత్తగా నేను పరిచయంచెయ్యవలసింది యేమీ వుండదు. ప్రదర్శనం చూడని ప్రేక్షకులకు ఈ అచ్చుప్రతియే తన్నుతాను పరిచయం చేసుకోగలుగుతుంది.

అయితే, తీరు తీయాలుగల తేట తెనుగు భాషలో "ఆసామి" లాటి నాటక రచనలు మనకు అనుదినము రాజాలవనిమటుకు నేను గట్టిగా చెప్పగలను.

— కొప్పరపు సుబ్బారావు

# ముఖ్యపాత్రలు

| | |
|---|---|
| ధర్మయ్య :- | 45 సం॥ |
| శ్రీరంగం :- | 50 ,, |
| అమరయ్య :- | 50 ,, |
| ప్రసాద్ :- | 24 ,, |
| కొండయ్య :- | 35 ,, |
| దాసు :- | 26 ,, |
| చలమయ్య :- | 35 ,, |
| జ్ఞానయ్య :- | 60 ,, |
| సర్కిల్ :- | 40 ,, |
| అమీనా :- | 45 ,, |
| వీరమ్మ :- | 40 ,, |
| శాంత :- | 15 ,, |
| మరికొందరు :- | |
| కాలం :- | ప్రస్తుతం. |

స్థలం :- 1, 3, 5, 7 రంగాలు ధర్మయ్యగారింట్లో.

,, 2, 4, 6 రంగాలు అమరయ్యగారింట్లో.

# నా మాట

ఇది నా మొదటి నాటక రచన. ఇందులో చాలా భాగం నా స్వానుభవమని చెప్పాలి. నేటి మధ్యతరగతి రైతు మనస్తత్వం, అతని ఆశలు, కోర్కెలు, వూహాలు, యదార్థ జీవితంలో ఎలా విచ్ఛిత్తై నానాట తను ఆసామిగా మనలేక కూలీగా, పాలేరుగా కడకు బికారిగా ఏగోడనీడనో రాలి పోయే స్థితికి ఎలా దిగజారి పోతున్నాడో చెప్పాలని నా ప్రయత్నం.

ఇది నా తలకుమించిన పని. అయినా సాహసించాను. ఆంధ్ర నాటక రసజ్ఞులు, రచయితలు, కళాకారులు, పెద్దలూ, పిన్నలు, ముఖ్యంగా ఆసాములు యిందున్న దోషాలు మన్నించి, మంచినెంచుకుని ఆదరించి నా అభివృద్ధికి చేయూత నిస్తారని నా ఆశ.

ఈ నాటకాన్ని వుత్తమంగా ప్రదర్శించిన విజయవాడ ప్రజా నాట్యమండలి వారికి, నా కోర్కెను మన్నించి తమ అభి ప్రాయాన్ని ప్రేమతో ప్రసాదించిన వుత్తమ నాటక రచయిత లైన శ్రీయుత కొప్పరపు సుబ్బారావుగారికి, నాకు సలహాలు యిచ్చి తోడ్పడిన మిత్రులందరికి, ప్రచురించిన నగారా ప్రచు రణాలయం వారికి నా హృదయపూర్వకాభివందనములు.

నాజర్.

ఆంధ్రనాటక కళాపరిషత్తు అష్టాదశ వార్షిక మహా సభలు ది. 7, 8, 9 మే 1954 బందరు మినర్వా హాలులో శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సందర్భంలో పుత్తమ నాటక ప్రదర్శన పోటీలలో

# ప్రథమ బహుమతి బడసిన నాటకము.

—: నాటి నటీనటులు :—

| | |
|---|---|
| ధర్మయ్య :- | శ్రీ మాచినేని వెంకటేశ్వర్రావు. |
| శ్రీరంగం :- | ,, కర్నాటి లక్ష్మీనరసయ్య. |
| ప్రసాద్ :- | ,, రాఘవాపురపు అప్పారావు. |
| అమరయ్య :- | ,, నాజర్. |
| కొండయ్య :- | ,, వెంగళనాథం. |
| దాసు :- | ,, పురాణం వెంకటసుబ్బారావు. |
| సర్కిల్ :- | ,, విన్నకోట రామన్నపంతులు. |
| జ్ఞానయ్య :- | ,, కాకర్లపూడి వెంకటరాజు. |
| చలమయ్య :- | ,, తమ్మిన రామారావు. |
| అమీనా :- | ,, జొన్నాదుల పిచ్చయ్య. |
| వీరమ్మ :- | శ్రీమతి కొప్పరపు సరోజిని. |
| శాంత :- | కుమారి కొమ్మినేని హైమ. |
| మ్యూజిక్ :- | బి. గోపాలం. |
| ప్రొడక్షన్ :- | విజయవాడ ప్రజానాట్యమండలి. |

# 1-వ రంగం

## — ధర్మయ్యగారి యిల్లు —

(రెండు కుర్చీలు, టేబులు, సోఫా, పులిచర్మం కుర్చిన ఒకబల్ల, గోడకు రాముడు, కృష్ణుడు, మొదలైనవారి పటాలువున్నాయి.

శాంత : (గది చిమ్ముతూ)

- పాట -

నాగా దిగరా - నా
యన్న దిగరా
నాగా దిగరా - నా
మనవి చేకొనరా నా॥
వూరికి వుత్తరాన
వూడల్లా మర్రికింద
కోనల్లో వుండేటి
కోడె నాగన్నా నా॥
దిగు దిగు దిగు నాగా
దివ్య సుందర నాగా
ముదముతో రేపల్లె
ముద్దూల నాగా దిగు దిగు దిగు నాగా.

ధర్మయ్య : (వస్తూనే) ఏమిటే అది ?

శాంత : (పూడ్చిన పోగు ఎత్తుతూ) ఏమిలేదు దొరా.

ధర్మయ్య : మా బాగా పాడుతున్నావే. ఎక్కడనేర

శాంత : ప్రసాదుబాబు దగ్గర నేర్చుకున్నానం

ధర్మయ్య : ఊహుఁ...నువ్వాయనబళ్లో చ

శాంత : అవునండి యిప్పుడే పాటాలు

ధర్మయ్య : మరి ... వుత్తరాలేమైనా వ్రాస్తున్నావా?
శాంత : అచ్చరాలు అమ్మగారికి కుదిరినట్టు కుదరటంలేదండి.
ధర్మయ్య : ఏడ్చావులె పో. పో!
శాంత : (వెళ్లుతూంది.)
ధర్మయ్య : ఒసేయ్! శాంతా! శ్రీరంగం వచ్చాడేమో ఆఫీసు గదిలో చూడు.
శ్రీరంగం : (వస్తూ) వచ్చె! వచ్చే!
ధర్మయ్య : (నవ్వి) ఓ ... నూరేళ్లూ బ్రతికేట్టున్నావయ్యా శ్రీరంగం.
శ్రీరంగం : ఎందుకుబాబూ! చివాట్లకా? కళ్లూ కాళ్లూ వుండగానే రాలిపోనివ్వండి.
ధర్మయ్య : (మళ్ళీనవ్వి) ఊఁ...ఏంజేసుకొచ్చారు?
శ్రీరంగం : చేసేదేముంది?
ధర్మయ్య : వాయిదా వేశారా?
శ్రీరంగం : లేదు.
ధర్మయ్య : మరి?
శ్రీరంగం : కౌలుదార్లే గెలిచారు.
ధర్మయ్య : కౌలుదార్లు గెలిచారు!
శ్రీరంగం : ఎక్కడికి గెలిచినట్టూ, ఆగండి.
ధర్మయ్య : ఏమిటయ్యా ఆగేది! ఆ వేళంతా నీగుప్పెట్లో వున్నట్టు కా?

...ం లేకండా పండించేవాళ్ళను తొలగించరాదని,
...నప్పుడూ......
...త్తదా పాతదా? నా పొలం నేసాగు

చేసుకుంటానంటున్నా. నన్ను కారణం అడిగేవనే మొచ్చిందేకోర్టుకైన?

శ్రీరంగం: ఏ మొచ్చిందో!

ధర్మయ్య: మరి నువ్వు తీసికెళ్ళినడబ్బు ఎక్కడతగలేసినట్టూ?

శ్రీరంగం: తమరు శలవిచ్చినట్టే జాగ్రత్తగా సర్దేవాడాను. ఏంలాభం చెప్పండి. మన సాక్ష్యాన్ని మొత్తంగానే తిరగదీశాడుగా యీ కుర్రవెధవ.

ధర్మయ్య: ఆఁ!

శ్రీరంగం: ఆఁ! ఏదో మేతవేసినట్లుంది.

ధర్మయ్య: ఏడ్చాడు. వాడికుంది మొయ్యను.

శ్రీరంగం: వాళ్ళూ తలాకాస్తా వేసుకున్నారటలెండి.

ధర్మయ్య: యీ నెధవలకి బుద్ధుండక్కర్లా. మేసినన్నాళ్ళూ మేసి మధ్యలో ముంచుతారా?

శ్రీరంగం: అనుకుంటాంగాని, నీళ్లు నీళ్ళవంకపారక మిట్టలెక్కి పారుతవా చెప్పండి?

ధర్మయ్య: పారనివ్వండి. పారనివ్వండి. మరి వాళ్ళ వుత్తర సాక్షులెవరూ?

శ్రీరంగం: పేరయ్యా, పెదరామయ్యా, నర్సిరెడ్డి, అమరయ్యా.

ధర్మయ్య: అమరయ్యా!

శ్రీరంగం: ఆఁ! వాళ్లు గెలవటానికి మూలం యీ అమరయ్య సాక్ష్యమేనండి. తలనెరిసినవాడు గదూ.

ధర్మయ్య: ఊఁ......

చలమయ్య: (ప్రవేశం) దండంపెడతా దొరగారూ!

ధర్మయ్య: ఉఁ ... ఉఁ ...

శ్రీరంగం : ఒరేయ్ చలమాయ్. దొరవారు రమ్మంటున్నారని అమరయ్యను తీసుకురా.

చలమయ్య : ఒహోహో! అసలే ఎండబడ్డదుండి. యియ్యాల మీా సొకల్దిగూడా వుళ్లో లేదు.

ధర్మయ్య : ఊఁ ...

శ్రీరంగం : ఏడ్చావులె పోరా!

చలమయ్య : (గొణుక్కుంటూ వెళుతున్నాడు)

ధర్మయ్య : ఒరేయ్! వచ్చేటప్పుడు గురవయ్యకొట్లో అగ్గిపెట్టె సిగరెట్ పెట్టె పట్టుకురా ... ఏది

చలమయ్య : (అక్కడే నుంచున్నాడు.)

ధర్మయ్య : ఆఁ ... ఆవజ్గా యిలాతె ... తొందరగా జావు.

చలమయ్య : (వెళ్లాడు)

ధర్మయ్య : వ్రితివెధవ ఎదురుమాట్టాడ్డం నేర్చాడు. (పేజీలు తిరగవేస్తూ)

శ్రీరంగం : తమాషా అంతా తరిఖీదులోవుందిలెండి.

ధర్మయ్య : వుంటే తింటారు. యింతకీ ప్లీడరేమన్నాడు?

శ్రీరంగం : అనేదేమిటి! ఓహోహోహో ఏ మార్గ్యుమెంటు ఏ మార్గ్యుమెంటు! ఆయన మాట్లాడినంతసేవూ కోర్టు గోలెత్తిపోయిందంటే నమ్మండి.

ధర్మయ్య : మ్చొ. ఫీజెంతో తెల్సా?

శ్రీరంగం : ఎంతిచ్చినా దండగలేదంటాను. అసలీ అమరయ్య సాక్ష్యం వ్రిసాదరావు వ్రయివేటేలేకపోతే ... ...

ధర్మయ్య : వ్రిసాదరావు! రాజేంగాడు?

శ్రీరంగం : ఎందుకాడు? "వుల్లిపూలవనేమధ్యే జోరీగే

పండితోత్తమా'' అని యీ తలకాయల్లేని వెధవలంతా వాడికి బ్రహ్మరధం పడుతూంటె ...

ధర్మయ్య : ఊఁ ......

శీరంగం : కావాలంటె పొలంయిచ్చి కాడిక్రిందికి ఎద్దునిచ్చి అడిగినప్పుడల్లా ఎద్దునోటికి కట్టందించినట్టు పాతికో పరకోయిచ్చి ......

ధర్మయ్య : యీ వెధవ మొఖంజూచి యిచ్చామా ? (పుస్తకం జూపుతూ) యింతాజేసి ఏడువందలేనా అయింది.

శీరంగం : రాత్రి తెల్లవారిందాకా అవస్తపడితె. ఆ మాత్ర మైనా తేలింది.

ధర్మయ్య : ఆఁ!

శీరంగం : ఆఁ!!

దాసు : (ప్రవేశం) దొరగారూ !

శీరంగం : ఏం ?

దాసు : జీతవండి.

శీరంగం : నీకూ యిప్పుడేతీరిందీ!

దాసు : శాంత పుట్టిందిపుట్టినట్టేవుండె దొరగారూ! దానచ్చటా ముచ్చటా ఎవరు సూత్తారు సెప్పండి!

శీరంగం : పరవాలేదులేవోయ్! నీ చెల్లెలుచక్కదనం చిన్న బోదులే!

దాసు : కాదండీ! మనువులొచ్చిపోతావుండె. దానికాత్త ముక్కుకీ సెవ్వు కన్నా...

శీరంగం : యిప్పుడుగాదు పో!

దాసు : మల్లీ దొరగారుంటే మీరుండరు, మీరుంటె దొరగారుండరు.

శ్రీరంగం : సాయంత్రం జూద్దాంపోరాంటె!

దాసు : డబ్బులు సాయింత్రమె యిద్దురుగానిలెండీ.

శ్రీరంగం : అబ్బే! మీరెందుకు వింటార్రా! ఏదీ! ఓమాటు ఆ పుస్తకం యిలాయివ్వండి.

ధర్మయ్య : (పుస్తకం యిచ్చాడు. కుర్చీలోనుండి లేచి అటూఇటూ పచారు జేస్తున్నాడు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.)

శ్రీరంగం : (కాగితాలు తిరగవేస్తూ) ఆఁ... యిప్పటికి నీవు వాడుకున్నది నాగాలుగాక వందరూపాయలురా.

దాసు : నాగాల్లేవులెండి.

శ్రీరంగం : లేకపోవటమేం ?

దాసు : ఎక్కడుండీ ?

శ్రీరంగం : ఎక్కడా? (పుస్తకంమీద తట్టుతూ) తాటికాయలంత అక్షరాలతో యిక్కడవున్నాయ్.

దాసు : ఆఁ......!

శ్రీరంగం : ఆఁ...!! మార్చిలో తడవరపోసిందని వద్నాలుగు రోజులు, మేలో ఎద్దుబాడిచిందని గుండెల్లో నొప్పి పట్టిందని......

దాసు : దొరగారూ !

ధర్మయ్య : (అటు జూచాడు.)

శ్రీరంగం : ఏం ?

దాసు : అయ్యా నాగాలేనుండి !

ధర్మయ్య : అంటే ఆ రోజుల్లో నీ కింద పనికొచ్చినవాళ్లువూరికే జేశారనా ?

దాసు : కొత్త అయితే ఆ ఎద్దు మయ్యానిసంపినట్టు నన్నూ

సంపాల్సినమాట. పోని అమాసలకి పండగలకి వస్లో కొచ్చాగా!

శీరంగం : వస్తే ఏవంటావ్‌రా?

దాసు : పోనీ ఆ రోజులీటికింద లెగ్గట్టుకోండి.

శీరంగం : ఎట్టా?

దాసు : ఆ రోజుల్లో అరశవస్లేదాయ. ఎద్దులూరికేవుంటావుండె.

ధర్మయ్య : ఎద్దులూరికెవుంటే మీరూ వూరికెవుండాలా ఏరా? పిచ్చిపిచ్చివేషాలు ఫేయక లెక్కజూచుకొని న్యాయంగా నీకు రావలసింది పట్టుకెళ్లు!

శీరంగం : మాటలు జెప్పేవాళ్లేగాని ఒక్కపూట తిండిబెట్టే వాళ్లులేర్రా దాసూ? మన్నడిగా వుండి మంచి అనిపించుకోవాలంటె చాలాకాలం బడుతుంది. చెడుదేముంది ఒక్కక్షణం. ఎందుకు జెడతావుగనీ విను! విను.

దాసు : చెప్పండి – బాగుపడి సావబొయ్యావంట.

శీరంగం : మీ నాయనతాలూకు దిగబడినవడ్డీబాపత్తు యాభై రూపాయల తొమ్మిదణాల నాలుగుపైసాలున్నా, మీ నాయన దినానికి వాడినవి వడ్డీఅసలుఫాయిదాలు నూట యాభై, వెరశి మొత్తం, రెండువందలరూపాయిాల తొమ్మిదణాల నాలుగుపైసలురా.

ధర్మయ్య : ఏమయ్యో శీరంగం! వాడి జరుగుబాటూ అది ఆలోచించి ... ...

శీరంగం : ఆఁ...ఆఁ...అందుకే వందకు నోటురాయించి మిగిలింది చెల్లురాయిద్దాం అనుకుంటున్నా. ఏవంటావ్‌రా?

దాసు : మీ దయొచ్చినట్టే గానియ్యండి.

శీరంగం : మధ్య మా దయేంటోయ్. నీకష్టం నీకిచ్చేదానికి.

దాసు : హుఁ.... నా కట్టం. యీ జీతంజేసేకన్నా మూడూళ్లు ముష్టెత్తుకు బతకటం మేలు. (వెళ్లాడు)

ధర్మయ్య :
శ్రీరంగం : } (ఒకరి మొకాలొకరు చూచుకున్నారు.)

చలమయ్య : (వచ్చాడు, అగ్గిపెట్టెసిగరెట్టు పెట్టె బల్లమీద పెడుతున్నాడు)

శ్రీరంగం : ఏడిరా?

చలమయ్య : వత్తన్నారండి; అన్నందింటన్నారు.

ధర్మయ్య : (కుర్చీలోవచ్చికూర్చుని, కణతలు వొత్తుకుంటూ)అరేయ్ చలమాయ్! అబ్బా! తల పగలగొట్టుకుపోతూందిరా. మందేమన్నా !

చలమయ్య : తెమ్మంటారా ?

ధర్మయ్య : పొయ్యిరా!

చలమయ్య : మరి;.........

ధర్మయ్య : ఏం? నువ్వ్యాజూడాలనా?

చలమయ్య : (నవ్వాడు)

ధర్మయ్య : ఊఁ...అఘోరించు.

చలమయ్య : (వుషారుగా వెళ్ళాడు.)

శ్రీరంగం : (వేళ్ళేవాణ్ణి చూస్తూ) ప్రతివాడికి యీ చేతులుజాచటం బాగా అలవాటైపోయిందండి.

ధర్మయ్య : పైనుంచి క్రిందిదాకా లంచమేవుద్యోగధర్మమైపోయిందిలే. ముండమోపి కౌలుదారి వ్యాజ్యానికి మూడువేలయ్యాయంటే ఏమిటే?

శ్రీరంగం : ప్రతీవ్యవహారం యిలాఅనుకోబట్టే ఏకు మేకవుతూవుంది. చిన్నపామునైనా పెద్దకర్రతోనే కొట్టమన్నారు.

నిజంగా పెద్దబాబుగార్ని జెప్పుకోవాలండి, ఆవులించితే
ప్రేవులెక్క-వేశేవారు.

ధర్మయ్య: ఊఁ......

శ్రీరంగం: ఆకోరమీసం, ఆ కోపుతలగుడ్డ చేతిలో ఆ వొంకి
కర్ర, కిర్రుచెప్పులూ పెరపెరలాడుతూ వీధినవస్తావుంటె
ఆడది ఎదురువచ్చి ఎరుగటండి ఆయన చచ్చేవరకు!

ధర్మయ్య: ఊఁ...... (మీసం సవరించుకున్నాడు.)

శ్రీరంగం: మీరిట్లా మీనమేషాలు లెక్క-వేస్తూకూర్చుంటే
వూరు మన చేయిజారి పోయేట్టుంది.

ధర్మయ్య: ఆదశేవస్తే వూరు వల్లకాడుగామారుతుంది తెల్సా!

శ్రీరంగం: తెల్సు. మీరు వూనుకుంటే వూరుకువూరునే తిర
గ్గట్టించగలరనికూడా తెల్సు. మరీ... మన పొలం
మీదే బ్రతుకుతూ మన మీదకే యీ అలగాజనాన్ని
తోలుతున్నారే యీ అమరయ్యా ప్రసాదులూ...ఆఁ
...ఆఁ.............

ధర్మయ్య: అవును. వుపేక్షించి వూరుకుందామా వూరు జారి
పొయ్యేట్టుంది. తాడోపేడో తేల్చుకుందామా ప్లానంతా
తల్లకిందులయ్యేట్టుంది...ఊఁ......

శ్రీరంగం: ఏది?

ధర్మయ్య: ఆఁ! వుందిగా, మనవూరుముందు యాభై యకరాల్లో
వీళ్ళదొక రెండెకరాలు కడుపులో వుండల్లే......

అమరయ్య: (వచ్చాడు) దండాలండి!

శ్రీరంగం: (కుర్చీ చూపుతూ) ఆఁ... ఆఁ... రా అమరయ్యా,
కూర్చో.

అమరయ్య : ఎందుకులేండి.
శ్రీరంగం : అదేమిటయ్యా?
అమరయ్య : కుర్చీ ఎందుకులెండి.
శ్రీరంగం : కూటికిపేదవైతే కులానికి పేదవటయ్యా? సాటిసంసారివి. పండంటి ఆసామివి.
అమరయ్య : ఎక్కడకూర్చుంటె ఏవుందిలెండి.
శ్రీరంగం : అయితె కుర్చీలోనే కూర్చో.
ధర్మయ్య : కూర్చో! కూర్చో!
శ్రీరంగం : రైతులేందె రాజ్యంలేదన్నారయ్యా!
అమరయ్య : ఆఁ ... ఏమన్నారో (కూర్చున్నాడు)
శ్రీరంగం : కాదులే. దొరవారికి వ్యతిరేకంగా సాక్ష్యం జెప్పానే అని,
ధర్మయ్య : ఊఁ... దానికేమొచ్చె. మనంఎరగని అమరయ్యా శ్రీరంగం!
శ్రీరంగం : అవునవును. వట్టిఅమాయకుడు. కుడుంయిస్తే పండుగనుకుంటాడు.
ధర్మయ్య : నలుగురూవచ్చి పట్టుబడితే కాదనలేకపోయివుంటాడు. పోయింతరువాత యిష్టమున్నా లేకపోయినా వాళ్లు జెప్పమన్నట్టు చెప్పాలిగా.
అమరయ్య : (నవ్వి) నిజంగనుక్కున్నారు.
ధర్మయ్య : దీనిదేమిటిగాని చూడు! మనవాడికేమిటా మాల చుట్టరికం? అంతపొద్దుబోకపోతె ఏ కేరంబోర్డో చీట్ల పేకో యిక్కడే తగలేస్తూ వుండొచ్చుగా.
శ్రీరంగం : బంగారమల్లే, యిదేం పరిచయంలేనియిల్లా? పాత చుట్టాలు, ఒక్కపాయలో బ్రతికినవాళ్లు.

ధర్మయ్య : అవును. పొలం బుట్ర, కులం గోత్రంలేని యోగీ జోగీ వాళ్లమటయ్యా ? పండంటి ఆసామికి అదివరువా!

అమరయ్య : చెపుతున్నా. నెత్తినోర్నురుబెట్టుకొని నేనూ జెపుతున్నా. అయ్యవారితోవుంటె ఏదోబతుకుదెరువుకింత బాటజూపుతారని. వాడికా బడిదేసే దేసై పోయ. ఏంజేసేది!

ధర్మయ్య :
శ్రీరంగం : } (ఒకరి తరువాత ఒకరు పెద్దగా నవ్వారు)

ధర్మయ్య : రంకుసాగితే పెళ్ళిఎందుకు అన్నట్టుంది. పోని వాణ్ణి మళ్ళీ బడికంపితె పోద్దిగా.

శ్రీరంగం : అవును. "సాంగత్యదోషాన సన్యాసి నశియించు రాజునశియించు దుర్మంత్రివలన" అన్నట్టూ ఏ స్నేహం జేస్తే ఆ బుద్ధులే అబ్బుతాయి. వెంటనే వాణ్ణి కాలేజికి సాగనంపవయ్యా!

అమరయ్య : ఏం సాగనంపమంటావు ? యీ రోజ్జుస్తే ఎన్ను మీదికి ఎర్రని ఏగాని లేదు. ధర్మయ్యగారి నడిగితె కోట్టిద్దెలు కొంద్రకులోకవని చేతికర్రకొచ్చినోడ్డి ఎందుకు చెడగొడతావయ్యా చదువని చట్టుబండలని...

శ్రీరంగం : అంటావంటావా ?

అమరయ్య : అన్నా, అనకపోయినా...

ధర్మయ్య : చూడు; శ్రీరంగం ! బి. య్యే. దాకా చదివిస్తే ఏమాత్రమౌతుందంటా ?

శ్రీరంగం : ఆం... రెండువేలు, మహాఅయితే మూడు వేలయ్యేను.

అమరయ్య : అమ్మో !

శ్రీరంగం : నువ్వట్టా వుండవయ్యా !

ధర్మయ్య : ఎన్ని రావటంలేదు ? ఎన్ని పోవటంలేదు ? కాలుదారు వ్యాజ్యంలో రెండుమూడు వేలు పొయ్యేలోబో స్తేపోలా!

శ్రీరంగం : ఆఁ. ఎందుకుబోలా ?

ధర్మయ్య : అందుకే; మనవూరుకో చిన్న స్కూలు ఏర్పాటు అయింది. లైబ్రరీకూడా శంఖుస్థాపనచేయించాం.

శ్రీరంగం : అవునవును. మంచినీటిభావి, సత్రంగూడా ఏర్పాటు చేయించాలని ఆలోచిస్తున్నాం.

అమరయ్య : సత్రమెక్కడండి ?

శ్రీరంగం : ఎక్కడా! మనస్మశానంప్రక్క మైదానంలోనయ్యా!

ధర్మయ్య : అందుకే ఒక బి. య్యే. విద్యార్థికూడావుండడం...

శ్రీరంగం : ఎందుకైనా మంచిది. ఒహోహో ఏమిత్యాగం ఏమిత్యాగం! చెప్పించటానికి వీరే సమర్థులు! చదవ టానికి వాడే సమర్థుడు!

అమరయ్య : అందులో అబద్ధం ఏవుంది దండీ. పలక పట్టింది మొదలు తరగద్దప్పకుండా యిస్కూలుపైను దాకా వచ్చాడు. చేతులో డబ్బులేక నేనే చెడగొట్టా..మ్మెః..

శ్రీరంగం : అవును. చదువుమాని ప్రజాసేవలోబడి చెడిపో య్యాడేగాని కుర్రవాడు తెలివైనవాడే.

ధర్మయ్య : చేసినవరుకు చాలుగాని ప్రజాసేవ యికవాణ్ణి కాశీ జీకి పంపుదాం.

అమరయ్య : మరి అబ్బాయిని తీసుకురమ్మంటారా ?

ధర్మయ్య : ఆఁ... ఆఁ...

శ్రీరంగం : చూచావా అమరయ్యా దొరవారిమనస్సు తెల్సు కోలేక వాళ్లు అనవసరంగా కోర్టుకీడ్చారుగాని కడుపులో కూడు తీసిపెట్టమంటె పెట్టరటయ్యా !

అమరయ్య : నాకు దెలియదంటావా శ్రీరంగం. వస్తా ధర్మయ్య గారూ !

ధర్మయ్య : ఆఁ ఆ.

శ్రీరంగం : చూడండి. ఆ చిల్లరపద్దులన్నీ ఆగంగా వడున్నాయ్. అన్నిటిని కలిపి ఒకగీతగీస్తే...

ధర్మయ్య : పోనియ్యవయ్యా, రేపురాయించవచ్చు. నీబాకీ కాదని వూరొదిలిపోడులే.

అమరయ్య : ఎందుకూ ? నోటురాసివుంచండి.

శ్రీరంగం : నోటు వ్రాసేవుంది. మళ్లీ నేను వూరువెళ్లితె వారం రోజులవరకు రాను. ఏముంది వేలద్దటమేగా !

అమరయ్య : సరె. కానివ్వండి... మరి వడ్డీరేటు ఎట్టాకట్టారు.

శ్రీరంగం : ధర్మవడ్డీయే!

అమరయ్య : అంతా అంతేగా!

శ్రీరంగం . అంటె నలుగురిలో ఆక్షేపణలేకండా మామూలు వడ్డీతోనే లెక్కదేల్చాను. 7 వందలైంది.

అమరయ్య : అమ్మో!ఏడొందలే!పోనీఅదిగూడా ధర్మవడ్డీతోనే?

శ్రీరంగం : అదెట్లా సాధ్యమయ్యా; అందరిదగ్గర మూడున్నర కాంపౌండువడ్డీ వసూలుజేస్తూ నీవక్కడికి తగ్గిస్తే కాలు దార్లంతా నాగొంతుపట్టుకోరూ... యింతట సంతో షించవయ్యా... (వేలు అద్దించాడు)

అమరయ్య (వాకిలిదాకావచ్చి) చూడండి ! మనం కట్టించబోయే సత్రానికి సున్నంరాయి అది నేనే తోలతాను. ఎట్టో కట్టా రొండోఎద్దును కొంటాలెండి.

ధర్మయ్య : ఎందుకయ్యా అదోదండగా! రేపొచ్చి మనదాన్లో ఒకదాన్ని తోలించుకెళ్లక.

అమరయ్య : (నవ్వి) రేపుతీర్చొద్దు !

శ్రీరంగం : తోలించుకెళ్లవయ్యా తీరకక్కడ వుంటుందట. వెనక మీరూ వీరు ఎలావుండేవారు. కాడిగట్టు పొలాలు వాడకట్టు చావిళ్లు పన్నెండుంబాతిక లోగిళ్లు. చూచే వాళ్లు ఒకతండ్రి బిడ్డలా అనుకునేవాళ్లు. మీరు పిల్లా జల్లా పదిమంది తినేవాళ్లుగావటం కాస్త అప్పుకు చెయ్యిజాపాల్సిరావడం పెళ్లిళ్లు పేరంటకాలు అల్లుళ్ల కట్నాలు ఒకటేమిటిలే! "అరయంగా కర్ణుడీల్గె ఆర్వురి చేతన్" అన్నట్టు యీనాటికి మీసంసారం యిట్లా అయిందిగాని, మీదీమంచాస్తే.

అమరయ్య : అయ్యో! ఆ వూరుముందు యాభైయకరాలు మాదేనండి!

శ్రీరంగం : అందుకే రొండో ఎద్దుంటె బాడుగో బండలో యిల్లు జరుగుతూవుంటుంది. యీ కౌలుపొలంలో నీ స్వంతపొలంలో అయివేజుపెట్టి యాటా ఒకయకరంకొని అక్కడ పారవేస్తే ...

అమరయ్య : కొనాలనే సూత్తన్నానండి. యాడజావను! ఆడా పాడా అన్నిటికి ఒక్కణ్ణైపోతిని. వస్తా దర్మయ్యగారూ!

ధర్మయ్య : ఆఁ...ఆఁ...చూడూ శ్రీరంగం ప్రసాదు యిక్కడికి ... ...

శ్రీరంగం : ఎందుకూ? మనంవెళ్ళి స్కూల్లో సీటుఖాళీవుందో లేదో అవన్నీచూచి గుడ్డలు అవీ కుట్టించి యాకంగా ఒకేసారి పంపేద్దాం.

అమరయ్య : సర్లేలెండి...వస్తాను.

శ్రీరంగం : వెళ్ళిరా.. నే వెళ్లి సాక్షులసంతకాలుచేయించుకొస్తా.

ధర్మయ్య : ఊఁ ... (శ్రీరంగం వెళ్లాడు)

కొండయ్య : (ప్రవేశం. వెళ్లే అమరయ్యను శ్రీరంగాన్ని చూస్తున్నాడు. తనకు తెలియకుండానే ఎడమ చేతిబొటనవేలు తడుముకుంటున్నాడు)

ధర్మయ్య : ఏరా !

కొండయ్య : దండంపెడతా దొరగారూ!

ధర్మయ్య : ఆఁ...ఆఁ...

కొండయ్య : డబ్బులుండి !

ధర్మయ్య : ఆఁ...

కొండయ్య : డబ్బులుండీ ! !

ధర్మయ్య : (నవ్వి) డబ్బులు ! ఒరేయ్ కొండలూ ! కంకీ, కాయ ఒకటేమిటిరా ! మనుషులతోసహా అన్నీ చాకైనా డబ్బులు చాకయ్యేట్టులేదురా కొండలూ !

కొండలు : ఎట్టాగండి.

ధర్మయ్య : ఏదో వనిరోజుల్లో వాళ్ళే తీర్చుకుంటారు ఏ మార్వాడీ దగ్గరో 10 వందలుదెచ్చి పాటిమీద పోద్దాం అనుకున్నా. ఊఁ...చస్తున్నారు పాపం !

కొండలు : చచ్చేదేందుండీ ! సంసారాలు సంచులకెత్తి లేవబోతుంటేను !

ధర్మయ్య : ఎక్కడికిరోయ్ !

కొండలు : బతకటానికుండి.

ధర్మయ్య : ఎక్కడుందిరా బ్రతుకూ ? ఎక్కడపడ్డామో అక్కడ దేవులాడుకోవాలిగాని. రైతులీమిడిమేళం తెచ్చిపెట్టకపోతే మీా ముతావరకైనా సర్దుబాటుచేసేవాణ్ణే. మర్చా ... చదువేంజేసిపోతావురా కొండలూ.

కొండలు : ఆఁ... సదువా ... పాడు.

ధర్మయ్య : పోనియ్యబాకరా సన్యాసి! చదువు మూడో నేత్రం అన్నారా.

కొండలు : కూటికి దెవులాడుకునేలికె తలపాణం తోకొచ్చా వుంటె యింకేందుండీ సతికేది. పనికి బడికి తూగదులే దొర! మరా కూలిడబ్బులిప్పిచ్చరా?

ధర్మయ్య : ఏవీ ?

కొండలు : ఆ తోట్లేసిన డబ్బులుండీ!

ధర్మయ్య : ఎంతా ?

కొండలు : యాభై యకరాలికి.

ధర్మయ్య : రేటెట్లా తెగిందేం?

కొండలు : ఒకరకంగా లేదండీ.

ధర్మయ్య : పోన్లే వకరితో మనకొంతేవిటి?

కొండలు : పొద్దు న్లేత్తే మీ సెప్పుసేతుల్లో మెలిగేవాళ్ళం దొరగారూ!మరీమనుత్తరపుచేలో బల్కట్టంతగిలిందుండి. తోలేసి గట్టెక్కేతల్కి సతమతమైందనుకొండిమటా.

ధర్మయ్య : మీ కష్టం నాకెందుకురా! (జేబులో చెయ్యిపెట్టాడు) ఊఁ .........

కొండయ్య : (దోసిటి పట్టాడు.)

ధర్మయ్య : సాయంత్రంవచ్చి మొత్తంగా రెండువందల యాభై పట్టుకెళ్ళండి. (అగ్గిపెట్టి దీశాడు.)

కొండయ్య : (కళ్లు తేలవేసి. చేతులుదులుపుకున్నాడు.) సర్లెండి! (వాకిలిదాకా వచ్చి. ఆలోచించి లెక్కతేలక.) దొరగారూ, ఎకరానికెంత పడినట్టుండి?

ధర్మయ్య : అయిదు.

కొండయ్య : అయిదూ! అయిదేందుండి?
ధర్మయ్య : అయిదేందుండి!
కొండయ్య : దూరపునీలుమోసి సచ్చిచెడి తోడేత్తే.....
ధర్మయ్య : ఎంతదూరమోయ్? కోసా రెండుగోసులా?
కొండయ్య : బుజాలు పచ్చిపుళ్ళయ్యిపొయ్యాని లబ్బున ఆగోరి త్తండారు మొగోళ్ళంతా.
ధర్మయ్య : వాళ్ళెట్లాంటి మొగోళ్ళురా?
కొండయ్య : ఏమొగోళ్ళయినా ఏంజేత్తారులెండి. చేనుగడ్డ కొట్టుడు. నలుగురు మడుసులు పాదులు బాడిత్తేనేగాని పనిజరక్కపోయ. వాళ్ళకూక్కలన్నా కట్టియ్యండి.
ధర్మయ్య : ఆఁ.........
కొండయ్య : వాళ్ల నలుగురికీ కూలండీ.
ధర్మయ్య : ఎందుకూ ?
కొండయ్య : ఎందుకేందుండీ !
ధర్మయ్య : ఒరేయ్ అరవకు. రేపొచ్చి యిన్ని పుల్లలో యింత కూరో గోంగూరో పట్టికెళుదూగాని. యింట్లో మరీ యిబ్బందిగాగూడా వుందన్నావ్‌గా.
కొండలు : ఆఁ... ఆయిబ్బందులుతీరేది సచ్చిన తెల్లారేలెండి. (కూర్చున్నాడు)
ధర్మయ్య : అయితే యిప్పుడు ఏవంటావురా ?
కొండలు : ఏవంటామ్. పనిరోజుల్లోనన్నా కడుపునిండాకూడు తినేట్టు సెయ్యమంటాం.
ధర్మయ్య : ఓ...అయితె కూడుతినకండానేజేస్తున్నారన్న మాట.
కొండలు : ఆఁ... అడుగుతారూ మాకూడు.

ధర్మయ్య : ఊఁ...... ఆవేళ అనుకుందెంతని ?
కొండలు : అడగండి ! దాసయ్యేగా పిలిసింది.
ధర్మయ్య : ఒరేయ్ దాసూ! ...... దాసూ !
దాసు : (తెరలో) ఆఁ... ఆఁ... (బైటకొచ్చి) ఏందండి ?
కొండయ్య : ఆయాల ఏవనుకున్నామియ్యా ?
దాసు : ఏయాలా ?
కొండలు : ఏయాలా ! తోట్లయ్యను పిల్సినాడియ్యా !
దాసు : ఏమనుకున్నాం ? నలుగురితోపాటనిగదూ ?
కొండలు : ఓయ్! మొత్తాన్కి దొరగారి జీతగాణ్ణనిపిచ్చినవే ! చేను పసిబిడ్డ మాడల్లేవుందని సేనుమూల్నకుంటని.
ధర్మయ్య : చేనుమూల్నగాక ఎక్కడుందోయ్ కుంట ?
కొండయ్య : వుంది. కుంటదగ్గరమడిశి చచ్చేట్టరిత్తే తోడేసే వాళ్లకినపడలా. మూలనుందంటమూల్న. నేల్నన్నా గాక.
దాసు : ఎంతిత్తావంటన్నారేం ?
కొండలు : అయిదిత్తారంట.
ధర్మయ్య : లా . పడబొడిశారని పదిస్తారోయ్ !
దాసు : కట్టం తగిలిందంటన్నారుగా ! పారెయ్యండి ఒకటో రెండో ?
ధర్మయ్య : త్చ్. త్చ్. త్చ్. ఎంతతేలిగ్గా జెప్పావురా. పారెయ్. సిక్షేపంలా పారెయ్. ఒరేయ్ మాదొడ్లో రూపాయలచెట్టులేదురా పారెయ్యటాన్కి...
దాసు : అదిగాదండీ నలుగురితోపాటన్నా...
ధర్మయ్య : నలుగురితో నాకొంతా. పొద్దున్నేస్తే నాపొలాల్లోకి రాందే బెత్తజరగదు.

కొండలు : నాలుగు పొలివేర్లా కావిల్లేందెన్నడుండి ?

ధర్మయ్య : అబ్బే సూరొోదుల్తారోయ్. వొరేయ్ దానూ ! చెప్తున్నా, మీరు యకరంమేర తన్నుకుజచ్చినాసరె అయిదుకన్నా దమ్మిడీ ఎక్కువిచ్చేదిలేదు.

కొండలు : నీ జీతంలో దిగట్టవయ్యా ! సైరామాలోడా అంటే బండిపరం మీదేస్కుసచ్చాడంటా ! అంతా నీడేల న్నట్టు సెప్పావుగా ఆయాల ?

దాసు : సేయించుకునే నాటిమాటలు యిచ్చేనాడుండకపోయె ! అంటే మళ్లీకోపాలు. సమ్మోలు కడతారంటెకట్టరూ ! (లోనికి వెళ్లాడు)

ధర్మయ్య : ఊఁ... కట్టించు, నువ్వూ కట్టించవోయ్ !

కొండలు : ఒకెదవ గట్టిచ్చేదేందుండి ? కడుపులో కాలేవోళ్లు సత్తారా ? యీవజాన చేసినచాకిరి దగ్గరబెట్టుకొని సంపుకుతింటుండారే ! మాకుమాత్రెం కడుపునిండా తినాలని, వొంటినిండా గుడ్డకట్టుకోవాలని, మాబిడ్డలు సదువుకోవాలని......

ధర్మయ్య : ఏందోయ్ నీవినుకుడు? నేనిచ్చేదంతె! తీసుకుంటారా లేదా?

కొండలు : వుంచుకోండి! మీరే యింకోఅంత్రతస్సేద్దురుగాని!

ధర్మయ్య : ఏరా ! కళ్లుపూడుకుపోతున్నాయా.

కొండలు : ఆఁ... మారాజుల మాన్నాల్లోతిని కళ్లూ కడుపు కానరాకుండా పోతండై. (వెళ్లాడు)

శ్రీరంగం : (వస్తూ) మూడుపుట్ల నల్లపూసలూ ఒకేరేవున తెగా

లన్న బ్రంహ్మంగారి సూక్తికి మనవూళ్లోనే ప్రారంభో త్సంలావుంది.

ధర్మయ్య : కోతపరువొచ్చిందండి!

శ్రీరంగం : వచ్చినట్లేవుంది. (నోటు అందిస్తాడు)

ధర్మయ్య : (నోటుతీసుకుంటూ) పూర్తి అయిందా ?

శ్రీరంగం : పొల్లుపోకుండా.

ధర్మయ్య : (నోటు తేరిపారజూచి) పిల్లెవరూ ? సాక్షులు.

శ్రీరంగం : మొన్నజచ్చిన వెంకయ్యాది, మనయింటిప్రక్కలేదూ క్షయరోగి కామయ్య, వాళ్లిద్దరివీ నేనే (చేశానని సైగ చేశాడు)

ధర్మయ్య : ఆఁ...

శ్రీరంగం : ఆఁ... కాలమొచ్చి చిక్కిందండీ లేడీ! యిరవై సంవత్సరాలనాటి కాగితాలు, శిరాలు, పట్టాస్టాంపులు అణాబిళ్లలు కావాలంటె రావాలి!

ధర్మయ్య : ఏడువందలే అన్నట్టుగుర్తు.

శ్రీరంగం : దానిదేముంది? అంకెలపట్టు ఒకటి అక్షరాలపట్టు వది, కలిపితె పదిహేడువందలు అయినట్టేగదండి!

ధర్మయ్య : ఓరి నీ అసాధ్యంగూలా!

శ్రీరంగం : అంటె మననోట్లకు ఒకప్రత్యేకతవుంటుందిలెండి. యిట్లాంటి అవసరాలు వస్తాంటాయనే కొంచెంకొంచెం ఖాళీలువుంచే వ్రాస్తుంటాను. (యిద్దరూ నవ్వుతున్నారు)

ధర్మయ్య : మరి దీని ఫలితం?

శ్రీరంగం : చెప్తా.

ధర్మయ్య : చెప్పటం వినటంతో మనవుంటె గెల్చాంగదాని అరకలు సాగిస్తారేమో.

శ్రీరంగం : కాలుదార్లేనా?
ధర్మయ్య : ఆఁ ...
శ్రీరంగం : సాగించనివ్వండి.
ధర్మయ్య : సాగించనివ్వండీ ?
శ్రీరంగం : అంతేనండి. మీరు లేవండి.
ధర్మయ్య : ఎక్కడికి ?
శ్రీరంగం : (ధర్మయ్య చెవులో ఏదో చెప్పాడు. తెరలో పాట)
ధర్మయ్య : ఆఁ ...?
శ్రీరంగం : ఆఁ ...!

(యిద్దరూ నవ్వుకున్నారు. యింట్లోకెళ్లారు. శ్రీరంగం కాగితాలకట్ట తోను, ధర్మయ్య పైగుడ్డ కోటువేసుకొని బైటకి వెళ్ళిపోయారు. యిది జరుగుతూవుండగా పాట పూర్తి అవుతుంది. తెరపడుతుంది.)

– పాట –

నీతివాక్యము లాడకుర – జీవా !
నీ నిజంబేదో
నిద్రమేల్కొని కనర నిజతోవ !
నీతులను వల్లించి నెత్తిన
చేతులిడి నిరుపేదసాదల
బాధలకు బంధించుటది – నీ
బ్రతుకుదెరువుకు బంధికాన ! నీ॥
రొక్కముందని మిడిసిపడతావా ?
భోగాలగని – వా
పెక్కు జగతిని ధిక్కరించేవా ?
మిట్టిపడి కాలాహిచీమలు
చుట్టబడి నశియించినట్టులు

నిక్కముగ చిక్కులకు చిక్కి
సుస్రిక్కిదవు నిక్కకురా - కుక్కా  నీ॥
నాది నాదని వాదులాడేవా
నీ పాడెవెంటా
మంచినెంచి వంచుకొనిపోవా
ఇందుగల నిక్షేప మెవరిది
అందరూ వెతకాలి శ్రమపడి
మంది మధ్యనె మంచిపుట్టును
అందమచటె అవతరించును  నీ॥

—(తెర)—

# 2-వ రంగం

## — అమరయ్యగారి యిల్లు —

(నులక మంచం, ఒకమూల్న మంచినీళ్ళబాన, యిత్తడి చెంబు రెండో మూల విడిసినగుడ్డలు, ఆమీదుగా దుప్పికొమ్ముకు యారగట్టసామాను, ఆముదంసీసా తగిలించివుంటాయి. ఎదరగా లక్ష్మిపటం తగిలించివుంది. అమరయ్య నులకమంచం కాళ్లకట్టబిగిస్తూవుండగా తెరలేస్తుంది. వీరమ్మ బుట్టచంకనెట్టుకొని వీధిలోనుంచి వస్తూ)

వీరమ్మ : లేవూ, లేవూ, లేవూ, ఆరినీలేవు పాడుగాను. వూడ్నుకుపోయినలేవు.

అమరయ్య : ఏందీ ?

వీరమ్మ : ఎట్టా యీవూళ్లో కాపరంజేసేది ?

అమరయ్య : ఏందంటె ?

వీరమ్మ : ఏవుంది ?

అమరయ్య : ఏమిలేనిదానికి ఎంమకట్టా యీగలుబడ్డగొడ్డల్లే యిదిలిచ్చుకోటం.

వీరమ్మ : మనమూ జేత్తన్నాం నగుబాట్టమారి కాపరం.

అమరయ్య : ఓయ్ ఎక్కడన్నా సెట్టుదొక్కొచ్చావా ఏం! అసలు సంగతేందో జెప్పవేం ?

వీరమ్మ : ఏందయ్యా సెప్పేది. పొద్దుట్నుంచి కట్టినగడపల్లా గాలిత్తే గిద్దెడు కందిపప్పు పుట్టకపోయె నా మొకానికి.

అమరయ్య : (నవ్వి) ఏడిసినట్టుంది. యింకా ఏందోననుకుంటినే.

వీరమ్మ : నీ కట్టనేవుంటది. వుప్పూతో తొమ్మిదీ వుంటేనే (యింట్లోకెళ్ళింది)

అమరయ్య : అదిగాదు నీ మేళాంపాడుగాను. నాలుక్కూరలు నావకాయ పిండొంటల్తో బోంచెయ్యటానిక్కి మనమేం

మా॰రాజులమా ? ఎద్దుముడ్డి పొడ్సుకునేవోళ్లకి మన కెట్టా కుదురుద్ది.

వీరమ్మ : అయ్యోరామ. ఆరుగాలం అరవశాకిరజేత్తంటే కూట్లో కూ॰రాశన్నా వుండొద్దు.

అమరయ్య : ఆఁ .... లేనికూర లెక్క॰డ్నుంచొత్తై. కారమో గడ్డలోసరిపెట్టుకుపోక. నీలో పాలో కాసినిబక్క॰నీలుండెగా.

వీరమ్మ : పొద్దున్న ఆ మాతల్లి ఏమంటా కందిపవ్వులేవందో కాసినిచ్చే ఆ బఱ్రెకూడా యీ పూట తన్నింది.

అమరయ్య : దానికేమొచ్చింది.

వీరమ్మ : గుప్పెడు ముట్టె గ్గుప్పెడు తవుడు దానిమొకానెయ్యక పోతిమి.

అమరయ్య : అయితె తవుడుకట్ట అయిపోయిందీ ?

వీరమ్మ : యింకెన్నాళ్లొత్తది. మూడ్నెల్లొచ్చింది.

అమరయ్య : ఏమొచ్చిందో. ఏ యమ్మనోటిన్నా మా యిల్లు గడుత్తుందంటే మా యిల్లు గడుత్తుందంటారు. యిదేం పాడిజెయ్యటమోమరి.

వీరమ్మ : అంతో యింతో అయితె నేనెప్పుడూ లేదనుకో, అయ్యకి కొడుక్కీ నంజబెట్టంగ ఎన్నిటికనొత్తదంటా ? కావరాలెట్టా గడుత్తాయయ్యా యిద్దూరం.

అమరయ్య : నీకన్నీ యిద్దూరాలె. ఎన్నిటికని జూవను. కొడుకేమోకొమ్మనగాడై తిరుగుతావుండె.

వీరమ్మ : యాడయ్యా సదువు మాన్పిందగ్గర్నుంచి ఏదోఒక పూట అరక్కెల్తానే వుండాడా.

అమరయ్య : ఊఁ......

వీరమ్మ : బడిమీద పదోఅయిదోవత్తే ముద్దరసుద్దిగా సీకే యిత్తన్నాడా.

అమరయ్య : యిత్తన్నా(రే.

వీరమ్మ : బిడ్డ! వాడుమాత్రిం వూరుకుంటుందెక్కడ. మయ్య మాటనిపిచ్చుకునే మడిశేనా ?

అమరయ్య : అయ్యో నువ్వు మురుసుకోవాల్సింది.

వీరమ్మ : ఏం మురుసుకోక. మయ్యబుద్దెవురికుంది.

అమరయ్య : ఉహుం...

వీరమ్మ : మన్ని పువ్వుల్లోబెట్టి పూజిత్తాడో లేదో సూడు.

అమరయ్య : ఆఁ......

వీరమ్మ : యిచ్చిందేవుడు సల్లంగా నూడాలెగాని. లోకానికి పేరుదేడూమయ్య.

అమరయ్య : బద్దరం.

వీరమ్మ : సాల్లే లేకిమాటలు; సరేగానీ యీపేడన్నా వాడికా రెండుగింజలు నత్తినేసేదుందా. బిడ్డ బమ్మాలశారల్లే తిరుగుతావుండాడు. వాణ్ణి జూసుకుంటె కడుపు పగిలి పోతావుంది.

అమరయ్య : ఏం జేస్తాంజెప్పు. ఎప్పుడూ తవ్వనూ పూడవనే సరిపోతావుండె. కుంటలు సెరువులూ పూడతన్నా యీ పాపిష్టి పొట్టలు పూడెదారి కానరాకపోయె. రెండో ఎద్దును కొందావంటేనే.....

వీరమ్మ : ఎద్దా! ఎందుకూ ఎద్దూ (అల్లాకిసాం పాట దూరంగా పాడుతూ ఫకీర్లు వస్తుంటారు. వాళ్లు దగ్గరకొచ్చినకొద్దీ అమరయ్య మాటలు పెద్దగా చెబుతుంటాడు)

అమరయ్య : ఏం? రెండో ఎద్దుంటె బాదుగోబండలో యిల్లు జరుగుతూ వుంటుందా? యీచిల్లరమల్లర కర్చులు ఎల్లిపోతంటయ్యా మనసొంత పొలంలో ఆ కాలు పొలంలో అయివేజుపెట్టి యాటా ఒక యకరంకొని అక్కడ పారేత్తే యీ యతలుండవుగా.

తెరలో ఫకీర్లు } పాడిపంటల్ సల్గువ్వం ద్వాల అల్లాకెనాం. తల్లిపిల్లల్ సల్గువ్వం ద్వాల అల్లాకెనాం.

అమరయ్య : యహే వుండండి. ఏంగోల ఉఁ... ఉఁ...

వీరమ్మ : (యింట్లోకి కెళ్ళింది)

అమరయ్య : ఏమాటా యినపడకండా. నే నరిగినాక ధర్మయ్య వందెకరాలు కొన్నాడు.

వీరమ్మ : (బిక్షం తెచ్చి పెట్టింది)

అమరయ్య : మనపనేమో రోజురోజుకి గోసిజాలక గోగునార కట్టుకున్నట్టు తగలబడతావుంది. ఎట్టోగట్టా ఆ రెండో ఎద్దును గొని ...

వీరమ్మ : వూరుకో వూరుకో. యీ పులుసుతో యీ ముద్ద పోతే అంతేచాలు. యిప్పటికే మోపుడు అప్పులతో తలమునిగివున్నాం. ఎందుకాడ్డి అప్పులపాలుజేత్తా.

అమరయ్య : యింకేం అప్పులుగాకుండాఎలగబెట్టరాదూఅమ్మా కొడుకు ఎవుడొద్దన్నాడు. నాకోసమేనాయిదంతా.

వీరమ్మ : ఎవురికోసమైనా యింకేముందయ్యా. తట్టలోకాపురం బుట్టలోకొచ్చే.

చలమయ్య : (వచ్చాడు) యీరమ్మగారూ బట్టలెయ్యండి.

వీరమ్మ : అయితె కలమయ్యా చీరదేకండా చేతులూపుకుంటా వచ్చావే యిర్యాలా యిట్టనేవుంచాలనా.

చలమయ్య : చావమంటారా ఏవండే, మాపిచ్చి మొగముది ధర్మయ్యగారి గుడ్డల్లో వత్తే.

వీరమ్మ : వత్తే తావడానికి తీరలేదా దొరగారికి. ఎవురిదన్నా యింతపీలికొత్తే దండంతాపారబట్టి తీసికెళ్తావే. ముందు బోయి తీసుకురా.

చలమయ్య : ఆడుంటేనా లేందుండీ.

వీరమ్మ : లేకేవైఁద్దిరా యదవసచ్చినోడా.

చలమయ్య : ఆ దొరసానిగారా సీరిచ్చి సావగొన్నారంటుండీ.

వీరమ్మ : సావగొన్నారూ!ఆళ్ళకేం పొయ్యేకాలమొచ్చిందిరా.

అమరయ్య : (పొగాకు పాయదీస్తూ యింట్లోనుంచివస్తూ) ఆఁ... పొర పాటువడ్డారేవోఁలే. లేకపోతే యీడే యక్కడన్నా పారేసి యీ దురువుకు తెచ్చుకున్నాడో.

చలమయ్య : అదిగదీ.

వీరమ్మ : పెద్దోరుజేత్తే పొరపాటు. అదే మనబోటోళ్ళమైతే లాగు లాగు అంటారు. పోయినట్టిగా సీరె.

అమరయ్య : లేకపోతే పాతసీరెకోసం బజారెక్కుతావాయేం!

వీరమ్మ : ఏం?

అమరయ్య : ఏఁ! పోయిన చీరె పోట్లాడితే వస్తదా!

వీరమ్మ : అంత లేకసత్తన్నారా!

అమరయ్య : పోనిస్తూ మనవేఁనంట అంతమాడిపోతావుంది.

వీరమ్మ : లే.

అమరయ్య : ఊఁ ... ...

వీరమ్మ : మూడు రోజుల్నుంచి పక్కసీరతో మురిగిసత్తావుంటే.

అమరయ్య : సచ్చావులె నోర్మూద్దూ. వళ్ళోత్తన్నయ్, ఏం లాభం.

తెరలో } రేవల్లె వాడలో చెంచీతా.
చెంచులు } గోవమ్మ నీలాడె వైభామ.

వీరమ్మ : మాయగుంపుకి ఎక్కడిదీ సాలటంలా. (యింట్లోక్కెలింది)

తెరలో } చిన్నారి అబాలా చెంచీతా.
చెంచులు } చిలకల్ల కొలికి వైభామ.

అందాల అబాల చెంచీతా
కుందాల తల్లీ వైభామ. (దూరం నుండి పాడుతూ మధ్యలో ఆపకండానే ఆఖరిచరణంవరకు వచ్చారు)

అమరయ్య : యిన్నారేవయ్యో, యిన్నాం యిన్నాం.

చెంచులు : (తెరలో) మహారాజులు, మహారాజులు.

అమరయ్య : ఆఁ... ఆఁ...అంతా మారాజులే. అడ్డగాడిదలల్లే వుండారు. ఏదన్నాపనికి పోరాదురా. మాపాణాలు తియ్యకపోతె.

చెంచులు : ఒకపాతసీర దయసేయించండి.

అమరయ్య : సీరా. మాకుంది. మాకులేక మూడుమూసి అర తుకుతున్నాం.

వీరమ్మ : (బిక్షం తెచ్చిపెడుతూ) ఏడో పుట్టపగిలినట్టుంది మాయ బిచ్చగోళ్లు.

చలమయ్య : ఆమారాజేమారాజో వకర్రైలుకిర్రైలే దించిండంట గదండీ కుట్లోళ్లని బొట్లోళ్లని.

వీరమ్మ : ఆ మారాజుల మేడల్లోనే తోలకపొయ్యాడు.

చలమయ్య : అనుకుంటాంగాని యీారమ్మగారూ అరుఎంగిలి సేత్తో కాకినిదిలిత్తారా? లెవ్వనోకద్దనో మనవెయ్యాల్సిందే శారెడు నూకలు.

అమరయ్య : మీారేనంటావ్. బిచ్చగాళ్లని బతికిత్తావుంది.

చలమయ్య : మాకుందిబతుకు ... మరా మేరగింజలు కొలిపి చ్చరూ. కొలిపిచ్చండీ యింటో యిబ్బందిగావుంది.

అమరయ్య : ఊc... ఊc... కొలుద్దాం, కొలుద్దాం.

వీరమ్మ : కొలవండి. మాదాకవళంఅమ్మాంటె మాయింటాయ న్నీకెదుర్రాలేదా అన్నట్టుంది.

చలమయ్య : యింకెన్నాళ్లించుకుంటారండీ. మళ్లీ సాలుగూడా ఎల్తావుంటె.

అమరయ్య : యాడికీ ఎల్లదుగాని ఆగరా.

చలమయ్య : మాకుమాత్రం జరగొద్దా ఏవండీ.

అమరయ్య : జరగాల్లే లేనితిప్పలే.

చలమయ్య : ఎద్దుగట్టి యెగసాయంజేసే మీరే యిట్టాఅంటె మేంజేసేది కాపరాలేనండి. (మూలనున్న గుడ్డలు మడతపెట్టు కుంటున్నాడు)

అమరయ్య : అందరం ఏడిసేది అదేలేరా. సరుకమ్మంగానే సరి పెడతాలె. ఆగు.

చలమయ్య : యీరమ్మగారూ: మీ బట్టలెయ్యేండమ్మా.

వీరమ్మ: (బైటకొస్తూ) వున్నవక్క-సీరా వాళ్ళఎదానకొడితివి. యింకేంపసేరి. మద్దాల నేనే పిండేసుకుంటాలెపో. (లోనికెళ్ళింది)

శీరంగం : (తెరలో) అమరయ్యా! అమరయ్యా.

అమరయ్య : ఎవురో.

శీరంగం : (వస్తూ) యిదేనటయ్యా మర్యాదా? మాటంటే చెల్లేట్టుండాలి; యిది నాలికయ్యా పీలిగ్గాదు.

అమరయ్య : ఏంపీలికా ఏందండీ.

శ్రీరంగం: యీఏడు మిరపకాయలూ, వుగాకు ధర్మయ్యగారి యింటికే తోల్తానన్నావా.

అమరయ్య: ఎవురూ! నేనా! అబ్బే, ఆయనగారుకూడా ఎప్పుడూ అన్నట్టులేదే.

శ్రీరంగం: అనాలటయ్యా. ఆయన అడక్కముందేతోల్తే ఎంత మర్యాదగా వుండేది. మ్చ్. లౌకికం తెలియని మనుషులయ్యా.

అమరయ్య: పోనియ్ యిప్పుడు మించిపోయిందేవుందండీ. (మంచంవాల్చి) కూసోండి. తోల్తాంలెండి రేపుట మావట.

శ్రీరంగం: ఆ హాఁ హాఁ కుదరదు కుదరదు యీ రోజే ......

వీరమ్మ: (చీపురు కట్టతోవస్తూ) అయితే సీరంగంగారూ. యింకా ఎంతుందేవండి మాబాకీ.

శ్రీరంగం: వుంటుంది. షుమారు ఏడువందలపైచిలుకు.

వీరమ్మ: పొట్టల్నాయగట్టుకొని తీర్చేది తీరుత్తానేవుండాం. పెరిగేదిపెరుగుతానేవుంది. మేంయిచ్చినియన్ని ఎక్కడ తగలపడి పోయా యింకా ఏడొందలుండను.

శ్రీరంగం: యక్కడికీపోలా. చెల్లులకు చెల్లులు జమలకు జమలు అన్నీ వివరంగా వ్రాసి అట్టిపెట్టేవుంచా.

వీరమ్మ: మారాజు ఏవంటా యిచ్చాడో గుక్కలోకి గుక్కెడు గంజిజారిన పాపానబోలా.

శ్రీరంగం: తినేవాళ్ళ రాతమంచిదిగావద్దూ.

అమరయ్య: అవున్లెండి. బుద్దులు బూములేల్తావుంటె రాత గాడిదలు గాసిందని ఏందో.

శ్రీరంగం: అదీ అసలువిషయం.

వీరమ్మ : ఏందోనయ్యా అంతా గందరగోళంగావుంది.

అమరయ్య : నీకెందుకు నువ్వూర్కో— నీమేళాం తగలేయ్యా.

వీరమ్మ : వూరుకోక వురిబోసుకుంటానా? నీయిట్టంవొచ్చినట్టే వూరేగుతుంటివిగా.

అమరయ్య : అదుగో అందుకే నోటిమీదగొట్టేది.

వీరమ్మ : మా తాత సంపాయిచ్చిందని నా బిడ్డ తినొచ్చేలకి, ఆ గోరడంతా లేకండాచేసేట్టున్నావు. నీ కాలుపాలం కట్టుకుపోను. పోయినంత పొడుగూ లోకులబొందలె పొడుగుజేత్తుంటివిగా. (ఏడుస్తూ యింటోకెళ్ళింది)

అమరయ్య : మాటకిముందు యాడవటంమాత్రం తెల్సు. నీ యేడుపు తగలెయ్య. ఛీ.

శీరంగం : "తనమగడెంత అర్జునపరుడైన పొరుగు పుల్లమ్మ కాపురము మెచ్చు" అన్నట్టు చస్తున్నామయ్యా!

పిసాద్ : (తెరలో. కిరి కిరి అనేమోత)

అమరయ్య : ఆయనెవరు?

పిసాద్ : (వస్తూ) నమస్కారం శీరంగంగారూ! (చేతిలో ఫకీర్ల గిరకవుండును)

శీరంగం : ఆఁ... ఆఁ... అదేమిటిరా అబ్బాయ్.

పిసాద్ : మా స్కూల్లో కుర్రాళ్లు చిత్రవేషాలు వేస్తున్నారు. అందుకు. (లోనికెళ్లాడు)

శీరంగం : ఎందుకొచ్చిన వెర్రివేషాలురా అబ్బాయ్. యీ రోజుల్నిబట్టి ఏదోవిధంగా పదిడబ్బులు చేసుకున్నవాడే ఘనుడు. యిప్పుడుగాకపోతే యింకెప్పుడు నువ్వు సంపాదించేది. (పిసాదు లోపలినుండి బైటకొచ్చాడు)

అమరయ్య : ఆ మా కెందుకంటారు. (పిసాదు శీరంగాన్ని తేరి పారజూస్తూ ఆయన చేతికర్ర తీసుకొని జూస్తుంటాడు)

శ్రీరంగం : ఖర్చంతా నే భరిస్తాను. కావలసినంత చదువుకో మంటె ధర్మయ్యగారిమాట కాదన్నావా? ఎల్లకాలం మీ నాయనకీ వోపిక వుంటుందా?

అమరయ్య : నేజచ్చిన తెల్లారి వూరికెగాలికిపోడండి.

శ్రీరంగం : యింకా నాలుగేళ్లు తంటాలుపడి ఏదోవిధంగా ఆ బి. య్యే. శాస్త్ర పూర్తిజేసుంటె వుద్యోగంకూడా ఆయనే యిప్పించేవాడా.

అమరయ్య : ఒకవుద్దోగం ఏందండీ.

ప్రసాద్ : మూడూళ్లు రాసిచ్చేపాడు.

అమరయ్య : వూళ్లు రాసియ్యాలిరా. ఒకడి మొకంమీద తన్ని నట్టు బతకటానికి బాటజూపిస్తే జాలదు.

శ్రీరంగం : (నవ్వి) కురితనం.

అమరయ్య : యింకా కురితనం ఏందండీ. కేపొచ్చే ఏరు వాక్కి యిరవైలో పడతంటె.

ప్రసాద్ : ఏమిటండీ విజయవాడ విశేషాలు.

శ్రీరంగం : ఏమున్నయిరా అబ్బాయ్. ఆ చెరువేదో బాగు చేయించాలని ...

ప్రసాద్ : విజయవాడ వెళ్లారు! (శ్రీరంగం చేతికర్ర మంచమునకు ఆనించుతాడు)

శ్రీరంగం : ఆఁ ... (నవ్వాడు)

ప్రసాద్ : (వెక్కిరింపుగా నవ్వాడు)

శ్రీరంగం : ఏదో పర్మిషన్ తీసుకోవాలిగా.

అమరయ్య : అవున్లెండి. ఏ చెరువండీ వూరజెరువా?

శ్రీరంగం : కాదూ. ఆఁ... గట్టు పక్క చెరువు.

ప్రసాద్ : ఆ చెరువు పల్లెకూలీలు దున్నుకుంటున్నారుగా !

శ్రీరంగం : దున్నుతారు. దున్నుతారు. చెర్వూలూ దున్నుతారూ రేపు యిళ్లూ దున్నుతారు.

ప్రసాద్ : నోరున్న మహారాజు లేచెరువులైనా దున్నుకోవచ్చు బతకలేసినవాడు పనికిరాని చెరువైనా దున్నుకోగూడదు. హుం...

శ్రీరంగం : పనికిరాక పోవడమేం ? హుం... ఎన్ని జీవరాసులు బతుకుతున్నాయ్ "ఆత్మవత్సర్వభూతాని"

అమరయ్య : కాదుమరి.

శ్రీరంగం : వెళ్లొస్తా అమరయ్యా !

అమరయ్య : ఉఁ... ఉఁ... పదండి.

శ్రీరంగం : మరీ... ఆయనకేం జెప్పమన్నట్టూ.

అమరయ్య : చెప్పేదేముంది. తోల్తాం అన్నాగా. తోల్తాంలెండి. మాటొకటా రొండా.

శ్రీరంగం : ఆఁ... ఆ... (ప్రసాదును కోరచూపులు చూచుకుంటూ వెళతాడు)

ప్రసాద్ : (శ్రీరంగం వెళ్లినవై పుజూస్తూ, తిరిగి) ఏమిటినాన్నా తోలేది.

అమరయ్య : ఆఁ... యీ ఏటిపంట.

ప్రసాద్ : ఎక్కడికీ.

అమరయ్య : ధర్మయ్యగారింటికి.

ప్రసాద్ : ఎందుకూ ?

అమరయ్య : ఆఁ... కాస్తబాకీ తగలబడెగా.

ప్రసాద్ : వుంటె ?

అమరయ్య : వుంటే !

ప్రసాద్ : సరుకుతోలటం ఎందుకూ అమ్మి డబ్బే యివ్వొచ్చుగా.

అమరయ్యా : ఏంతోల్తే. ఆయ నేంతింటా డా మిరపకాయలూ, పుగాకు.

ప్రసాద్ : అయితె మిరపకాయలూ పుగాకూ-డా తోలాలన్న మాట ?

అమరయ్యా : ఏంరాతోల్తే. ధరొచ్చినప్పుడు అమ్మి తనకు రావలసింది చెల్లుబెట్టుకొని మిగిలింది యిచ్చ్యాడూ.

ప్రసాద్ : ఆపనిమనమేఁ చేద్దాములె వీళ్లన్నమ్మి సరుకుతోలటం అంతమంచిదిగాదు.

అమరయ్యా : ఆఁ!... సాటోడ్ణి నమ్మక కూటికిలేని పకీరెదవల్ని నమ్మితె తింటాం... రెండుసేతుల్తో.

ప్రసాద్ : అలా అనుకున్నా వీళ్లెట్టా మనసాటాళ్లవుతారో.

అమరయ్యా : ఏమోఁయ్‌కాక కూటికిపేదవైతె కులానికి పేదవయ్యావా ?

ప్రసాద్ : కులంలేదు గిలంలేదు. యీ రోజుల్లో పొలంవున్నవాడే మహారాజు.

అమరయ్యా : ఊఁ... ఎవుడికుండే మారాజుతనం వాడికేవుంది లెవోఁయ్.

వీరమ్మ : (లోపలనుండి వస్తూ) పోరునట్టం పొందులాభం అని రోజు యేందిరా యీ గోల ఎట్టోగట్టా తగలెట్టుకోనియ్.రా. కూడుతిందుగాని.

ప్రసాద్ : ఏమిటమ్మా! నువ్వూ అట్లాగే అంటావ్ చేయి జారింతరువాత అనుకుంటె ఏంలాభం వుండేజాగ్రత్తేదో ముందేవుండాలిగాని.

అమరయ్య : మాలావ్ జాగ్రత్తగల్లోడివి బయల్దేరావులేవోయ్.

ప్రసాద్ : నువ్వేమైనాఅను. సరుకుమాత్రం తోలటానికి‌వీల్లేదు.

అమరయ్య : యీల్లేదూ? నీపెత్తనం వందోయ్ బోడిపెత్తనం తోత్త్రో లేదె.

ప్రసాద్ : మంచిగ్గాదు. అంతా తలపట్లు పట్టుకొని చావటాని కొచ్చినట్టుంది.

అమరయ్య : సావండిరా. అంతా కట్టకట్టుకుని దేంటోనన్నా దూకిసావండి. అంతెగాని మాటపొరపాటు రావటానికి యీల్లేదు. మడిసిజచ్చినా మాటజావదు.

ప్రసాద్ : యిట్టాఅనే సంసారాన్ని కాడికి దెచ్చావ్.

అమరయ్య : ఏమన్నావ్?

ప్రసాద్ : యికదేం వీల్లేదు.

అమరయ్య : యీల్లేదూ! యీల్లేదంటరా? యింతకాడికొచ్చా (ప్రసాదు మీదకెళుతున్నాడు.)

వీరమ్మ : బిడ్డ వాడిమాట కాదంటంఎందుకు? (యిద్దరిమధ్య కొచ్చింది.)

అమరయ్య : వంది వాడిమాటా నీమాటా (ప్రసాదు మీదికి ఎత్తిన చెయ్యి వీరమ్మ నెత్తిన పడింది.)

ప్రసాద్ : నాన్నా!

(తీవ్రంగా గదిమాడు. వీరమ్మ ఏడుస్తూ లోనికెళ్ళింది. తల్లివైపు అలాగేజూచి మరల తండ్రినిజూచాడు. అమరయ్య యికఅక్కడ వుండలేక పోయాడు. చరచరా వీధిలోకెళ్ళాడు.)

(అలాగే విచారంతో మంచంమీద చతికిలపడ్డాడు. యింతలో కాంత అడ్డవోడిలో పూలువేసుకొని వీరమ్మతో తలదువ్వించుకొనుటకు కాబోలు వుషారుగా వచ్చింది. ప్రసాదును జూచేప్పటికి సంతోషం మాయమైంది. ఏమిటబ్బాయిట్లావున్నాడనే తటపటాయింపుతో నెమ్మదిగా లోనికెళ్ళింది.)

జ్ఞానయ్య : (తెరలోపాట)

నిజముకల్లాతుంది. కల్లనిజమాతుంది.

నిజము నిలకడమీదె తెలియాలి బ్రహ్మయ్య

శివగోవింద గోవింద-హరి

భజగోవింద గోవింద.

వర్గభేదాలన్ని వలికిపాతాతాయి

వర్ణ-మై ప్రజలంత వర్థిల్లు బ్రహ్మయ్య ॥శివ॥

వర్ణధర్మాలన్ని వర్జింప బడతాయి

ధర్మ సూత్రాలన్ని తారుమారౌతాయి ॥శివ॥

(బైటకొచ్చి) అమ్మా! యీరమ్మతల్లీ!

పరిసాద్ : రా తాతా!

జ్ఞానయ్య : నువ్వా బాబూ?

పరిసాద్ : రా. కూర్చోతాతా.

జ్ఞానయ్య : (వచ్చి కూర్చుంటూ) కూర్చుంటె ఎట్లాగయ్యా! ఏలవ ట్టున ఆ యిల్లూ ఆ యిల్లూ తిరగొద్దూ. ఏం బాబూ అట్లావున్నా.?

పరిసాద్ : ఏం లేదు.

జ్ఞానయ్య : ఏం?

పరిసాద్ : మనస్సేం బాగలేదు తాతా. ఏదన్నా ...

జ్ఞానయ్య : మంచిశాస్త్రం జెప్పనా?

పరిసాద్ : కాదు. మంచిపాటపాడు.

జ్ఞానయ్య : పాటా (నవ్వి శృతిసరిజేసుకొని గొంతు మిళితంజేసి)

– పాట –

జన్మ ఒకసారె లభియించురన్నా

దాని సన్మార్గమందనుభవించుమోరన్నా

కామాంధకారమున కాలుదువ్వుచునుండు
కాలుదువ్వకమునుపె కనిపెట్టియుండు
చెవలాత్మ చెయిజారి చెదరిమేయుచునుండు
చెదరిమేయకమునుపే కుదరబట్టుండూ
జ్ఞానభాండము తరచు తరిగిపోవుచునుండు
తరిగిపోవకమునుపే తిరిగి నింపుచునుండూ.

కొండయ్య : (వస్తూ) ఓరి నీ కొంపలు గుల్లగాను. తిరిగి తిరిగి కాళ్లరిగిపోవడం కనపడిందిగాని సోలెడు గింజలిచ్చే మారాజు కనపడ్డే –.

పరిసాద్ : ఏం? ఏఁవన్నారు?

కొండయ్య : ఏఁవంటారు. తలకిమానెడిత్తాం. మేంబిలిసినప్పుడు పన్లోకిరావాలన్నారు.

పరిసాద్ : పనిరోజుల్లోనూ ఆ మానెడేనా?

జ్ఞానయ్య : మానెడుకాక గోనెడిత్తారాబాబూ!

పరిసాద్ : అవున్లే యేరోజుకారోజు వాళ్ళగడప కావలికాయాలిగా? రెండోపూటకి మిగిలేట్టిస్తారా?

కొండయ్య : అందరేఁవోగానీ, పెదకాపుగారన్నదె బెమ్మాండంగావుందుండీ! ముందలేడబ్బిచ్చినందుకు మొకరంతోట నాటేసేట్టూ, రూపాయికి అణావడ్డీయంట, వొడ్డీ ముందే మినాయించుకుంటారంట. కొంపలు తాకట్టు పెట్టి తలా పాతికెత్తుకెల్లమన్నాడుండీ. ఏడాదెల్లాలికి యియ్యకపోతే, తాకట్టుకీ వాకట్టుకీ సెల్లు.

జానయ్య : వోరి నీ యన్నాయం పాడుగాను.

పరిసాద్ : తెచ్చుకోకపోయారుమరి.

జ్ఞానయ్యా : ఎనకింత పాపంలేదుబాబూ! ఆ రోజుల్లో రైతులు పనోళ్ళందరికీ మేరలిచ్చేవారు. సేలో రైతు కైలుజేత్తా వుంటే, పనోళ్లంతా కోడెగాలాడుతూ వచ్చపచ్చంగ కళ్లాంసుట్టూ మూగేవాళ్లు.

పరిసాద్ : ఇప్పుడు మాత్రం మూగటంలా తాతా!

కొండయ్యా : ఏంది బాబూ మూగేది? జోరీగలా?

జానయ్యా : కుండలిచ్చిన కుమ్మరి, గుడ్డలిచ్చిన మాల, ఒకరేంటిలే, పనోళ్ళందరికీ కల్లంలో గింజలు కల్లంలోనే కన్న తల్లి యే బిడ్డను యెలా చూసుకుంటుందో అలాగే చూచి తలా చారెడుపంచి, తానూ చారెడుంచుకొనే వాడు ఆసామి. ఆ రోజులేవయిపోయాయి బాబూ!

కొండయ్యా : అది సత్తెకాలంలేవే! ఇప్పుడంతా యెంపలచెట్లకి నిచ్చెన్లేత్తున్నారు.

దాసు : (వొస్తూనే) ఎద్దులూరుకున్నా మేవుూరుకోడానికివీల్లేదు. డబ్బులియ్యాలచొచ్చేలకి అన్నీ పేచీలే.

పరిసాద్ : ఏవిటి దాసూ! (అంతా లేచారు)

దాసు : వంచిన్నడు వెత్తకుండా చాకిరీ సేయించుకుంటారు...

జ్ఞానయ : ఏందయ్యా?

దాసు : ఏవేందే? సేసిన శాకిరి నాగాలకింద సెల్లిపోతావుంటే, మీరుసెప్పండి పెసాదంగారూ యీనాయం. వూరంతా అమాసలకీ పెద్దపండగలకీ సెలవలిత్తన్నారా లేదా?

పరిసాద్ : ఊఁ.

దాసు : ఈయనీడంట అదేందో మరి.

పరిసాద్ : ఇయ్యకపోతే ఆయనేదికాక. యెక్కడైన చెయ్యాని చాకిరొస్తుందా?

దాసు : ఇంకో చోటకి పోనీయండే.

జ్ఞానయ్య : ఏఁవంటాడు?

దాసు : ఏఁవంటాడు. రెండువందలకిపైన దమ్మిడీయడంట. సెలవలు గిలవలు వప్పుకోడంట. నాగ్గిట్టదు బాబూ నే పోతానంటే, నా బాకీ నాగ్గట్టి పొమ్మంటుండె. ఆ బాకీజావ. యిద్దరం యిడబడిసేత్తావుండా, యెప్పటికప్పుడు ఆ వంద మిగుల్తానేవుండే. యట్టాగండీ సచ్చేది?

(తెరలో చాటింపు)

సమత్తవఁయినవారికి తెలియజెప్పేదేఁవనగా ధర్మయ్య గారి పొలాల్లో యెవురూ అరకలు కట్టగూడదహో!

(ఈ చాటింపు విని అందరూ వకరి మొహా లొకరు చూసుకున్నారు)

ప్రసాద్ : పంతులు విజయవాడ పేరెత్తగానే బెదరిపోయాడేమో అనుకున్నా ... ఊఁ

కొండయ్య : ఎవురు?

ప్రసాద్ : ఇంకెవురు శ్రీరంగం!

జ్ఞానయ్య : బాబూ! ఆ కేసింకా తెగలేదాయేంటి?

ప్రసాద్ : తెగనిస్తేగా!

జ్ఞానయ్య : హుఁ! కాలికేత్తే మెడకీ, మెడకేత్తే కాలికీ యాత్తుంటే... యింకేం తెగిసత్తదిలే.

ప్రసాద్ : వాళ్ళకాజబ్బు మొదటినుంచీ వున్నదేగా తాతా!

కొండయ్య : అసలుమన్లోమనకి మాటకలిసి చచ్చిందెక్కడుండీ. ఆయనగారిని యేఁవంటేయేం పెవాఁదమోనసి యెవుడు కాడు వొంగొంగి దండాలుపెడతుండ్రి.

జానయ్య : చెయ్యెత్తి మొక్కితే చేతులునరికినట్టు జేత్తండాడు మారాజు.

ప్రసాద్ : ఊఁ..! స్టేఆర్డరు తెచ్చారన్నమాట.

కొండయ్య : అంటే యేందిబాబూ ?

ప్రసాద్ : ఏవుందీ ! కేసు అటోయిటో తేలేదాకా యెవ్వరూ అరకలు కట్టకూడదని.

కొండయ్య : అయితే పోయినంతపొడుగూ యీ పాపాలబండి యిట్టా సాగిపోవల్సిందే నేముండీ ?

దాసు : ఆఁ, నీతోటల్లబ్బు యెగేత్తే నువ్వేంజేశా? నాజీతం యిరగ్గోస్తే నేనేంజేశా? అంతేవారూ!

కొండయ్య : ఛూ! ఏవిండీ యీబతుకు బతక్కపోతే. మొగబిడ్డ పుట్టి సచ్చాడన్నా అదీ ఒక పేరేనుండీ!

ప్రసాద్ : కొండయ్యన్నా అరిటాకు సామెతగా వున్నాం. ఈ చాటింపువిని రైతులకు నడుములు విరిగిపోయుంటై.

జ్ఞానయ్య : రైతులేందిబాబూ ! ఆమూరాజు ఆపొలవంతా అట్టా పాడుపెడితే యింకా యేఁవైనావుందా వూరి బతుకు.

కొండయ్య : యహె. పదండి సీరపోతులు గుక్కకోనేకంటే బొంత తగలేసిందిమేలు.

ప్రసాద్ : పోదాం. యీపాటికి రైతులంతా రచ్చబండదగ్గిర చేరుంటారు. మీరెళ్లి మీవాళ్లందర్నీ కలుపుకురండి. అందరం కలిసి మంచీచెడ్డా వివరంగా మాట్లాడుకుందాం. ఏదోఒకటి తేల్చేద్దాం. (కొండయ్యబుజంమీద చెయ్యివేసి) ఏవంటా ?

అమరయ్య : (వస్తూ) ఏవోఁయ్ కొండలూ ! బొత్తిగా కుడి చెయ్యి యెడమచెయ్యి లేకుండాబోయినట్టుంది ?

ప్రసాద్ : సరేలే పదండి. (అందరూ వెళ్లారు)

అమరయ్య : నువ్వెక్కడికిరా ? (ప్రసాదు ఆగాడు)

ప్రసాద్ : మనాళ్లతో మాట్లాడుదామని.

అమరయ్య : ఏంది నువు మాట్లాడేది ?

ప్రసాద్ : ఏందంటే ! విన్లేదా చాటింపు.

అమరయ్య : యింటే ?

ప్రసాద్ : ఆ విషయమే మాట్లాడుదామని.

అమరయ్య : ఏం ? వాళ్లు మాట్లాడుకోలేరా ? చెప్పేవాళ్లులేక చెడిపోయారని. నీ కెందుకురా ?

ప్రసాద్ : అదేఁవిటీ ? మన పొలంమాత్రం పోదూ ?

అమరయ్య : ఆ సంగతి నాకూ తెలుసు. అందు కేమన్నిమనం జాగ్రత్తచేసుకోవాల నేది. వూరందరితో బెట్టుకుంటే ఒకందానసరాదు.

ప్రసాద్ : ఊఁ !

అమరయ్య : ఎవుడిమాట యెవుడి నేట్టుంది. నీముందు నీమాట, నాముందు నామాట, మడిసిముందు మడిసిమాట మాట్లాడే మాయదారి కాలమైపోయె నే. యింకెప్పుడ్రా సీకు తెల్సేదీ ?

ప్రసాద్ : తెలియుందేవుందినాన్నా. పది పధ్నాలుగు సంవత్సరాలనుంచీ పోల్లూ బీళ్లూ దున్ని ...

అమరయ్య : దున్ని తేపవంటా ? ఈ రోజు ఆయనపొలం ఆయన దున్నుకుంటానంటున్నాడు.

ప్రసాద్ : ఆయనిష్టమేనా ?

అమరయ్య : ఏందది ? ఆయునిష్టంకాక నీ యిష్టవాఁ ?

ప్రసాద్ : పండిచేవాళ్లిష్టమేంలేదా ? ఏచేను ఏమూలుందో తెలియదు. మే డెటువట్టుకోవాల్నో తెలియదు. దున్నతాడంట దున్నటం. ఆయనకున్న మాత్రిం హాక్కు మనకులేదేం ?

అమరయ్య : వుంటే అయ్యన్నీ వాళ్లూ వాళ్లూ తేల్చుకుంటారులే. కూట్లో రాయితీసుకోలేనోళ్ళం మనకొద్దు.

ప్రసాద్ : వాళ్లెవరూ ?

అమరయ్య : ఎవురా ? కవులుజేసే ఆసాంవులు.

ప్రసాద్ : మనం కాదా ?

అమరయ్య : అవునో కాదో, ఏందిరా ! పీడ్రసవాళ్లు. మన కూడదని చెబుతుంటే యినవేం ?

ప్రసాద్ : కూడదని కూర్చుంటే కూటికీ గుడ్డకీ మాడిచావటంవే జరిగేది.

అమరయ్య : ఊం! చచ్చేవాళ్లని బతికిత్తాడీయన.

ప్రసాద్ : ఎవణ్ణెవడూ బ్రతికించేవాడు లేడు.

అమరయ్య : అందుకే యెవడిబతుకాడు దేవులాడుకోవాలనేది.

ప్రసాద్ : ఇప్పటిదాకా దేవులాడుకుంటుందదేగా ? దేవులాడుకుని దేవులాడుకుని యీస్థితికొచ్చాం.

అమరయ్య : ఏంవో ?

ప్రసాద్ : కనపడ్డంలే. ఏమైనా వూరందరిదీ యేదారో మన్దీ అదేదారి.

అమరయ్య : అదేవొద్దంటున్నా.

ప్రసాద్ : ఒద్దాన్నాకద్దన్నా నలుగురితోపాటు నడవాల్సిందే.

అమరయ్యా : ఇదిగో చెప్తన్నా. బాగా ఆలోచించుకో. కొంప మీదికేదైనా తెచ్చిపెట్టావో. నాగడవ తొక్కటానికి యీలుండదు. ఆఁ !

ప్రసాద్ : సరేలే. (చరచరావెళ్లాడు)

అమరయ్యా : ఆఁ! ఏందాపోవటం. పోతావంట్రా ? ఏవిఁరో ? ఒరే అబ్బాయ్!...... ఆఁ. సరేపో. (యింట్లోకి వెళుతు న్నాడు)

(తెర)

# 3-వ రంగం

## — ధర్మయ్యగారి యిల్లు —

(అంతా వెనుకటిమాదిరిగానేవుంది. ధర్మయ్య తుపాకిని తుడుస్తూవుండగా, శాంత అడ్డవోడిలో రెండుపొట్లాలువేసుకొని బైటనుండి యింట్లోకి వెళుతూంది.)

ధర్మయ్య : ఏమిటే అది ?

శాంత : (నవ్వింది)

ధర్మయ్య : నవ్వుతావేమే ! పిచ్చిముండ.

శాంత : మసాలాదినుసులు బాబుగారు.

ధర్మయ్య : సరేగాని, అవక్కడబెట్టి అమరయ్యగారియింటికి వెళ్లి ఎవరెవరున్నారోచూచి త్వరగారా.

శాంత : ఏందోనండి వూరంతా గందరగోళంగావుంది. యింకెవుర్నన్నా పంపించండి.

ధర్మయ్య : ఊఁ ...

శాంత : (యింట్లోకెళుతూంది)

ధర్మయ్య : శాంతా! చూడూ. చింతచేనుకెళ్లి మీ అన్నయ్యకి అన్నంయిచ్చి అక్కడేంజరుగుతూందో చూచిరా.

శాంత : (లోనికి వెళ్ళింది)

ప్రసాద్ }
కొండయ్య } (ప్రవేశం) నమస్కారమండి.

ధర్మయ్య : (యిటు చూచాడు)

ప్రసాద్ : ధర్మయ్యగారూ !

ధర్మయ్య : (తనపనిలో తానున్నాడు)

ప్రసాద్ : మీతో మాట్లాడ్డానికి ...

ధర్మయ్య : (చురచురా చూచాడు)

ప్రసాద్ : రైతులంతా పంపితే వచ్చామండి.

ధర్మయ్య : ఊఁ ...

ప్రసాద్ : ఆపొలంఎవ్వరూదున్నటానికివీల్లేదనిఆర్డరుతీసుకొస్తిరి.

ధర్మయ్య : ఏం ?

ప్రసాద్ : మీరే ఆలోచించండి.

ధర్మయ్య : అక్కర్లేదు.

ప్రసాద్ : పోనీ మీకు న్యాయంగావుందా?

ధర్మయ్య : లేదు.

ప్రసాద్ : తరుణంలో యీ ఆర్డరు తీసుకొస్తిరి. బలాలుగట్టి బలపర్చిన పొలాలు బీళ్లయిపోతావుండె.

ధర్మయ్య : ఎందుకుపోవు.

ప్రసాద్ : బంగారంవంటి పొలం.

ధర్మయ్య : అందుకే మీరు పాడుబెట్టినా...

ప్రసాద్ : పండించుకుతినలేక పాడుబెట్టామంటారా ధర్మయ్య గారూ! యీ మూడుసంవత్సరాలనుండి గొడ్డుమేతకి తిండిగింజకి మేం పడే అగచాట్లు ఎవరితో చెప్పుకోం ముసలి ముతక పిల్లాజల్లావున్న కొంపలు దినవస్తులె వుంటున్నాయ్.

ధర్మయ్య : పాపం!

ప్రసాద్ : పాపంలేదు. పుణ్యంలేదు.

ధర్మయ్య : ఏం లేకపోవటమేం? నాపొలం నే సాగుజేసుకోవట మంటె ఏమిటి? మీనోటికాడకూడు బోర్లదోయటమె గదూ!

కొండయ్య : తప్పఁరుగారికి తెలియందేవుందిలెండి.

ధర్మయ్య : కాళ్లు తగ్గించమనటం బకాయీలు రద్దుచేయమ నటం అధికవడ్డీలని కూలని గోంగూరని అలగాజనాన్ని నామీద కెగదోలటం న్యాయం ధర్మం. ఏం?

ప్రసాద్ : బొత్తిగా పండని సంవత్సరాల్లో అడుగుతున్నామండి బకాయీలు రద్దుచేయండీ అని.

ధర్మయ్య : ఏం? ఎందుకని?

ప్రసాద్ : పండంది ఎక్కడదెచ్చిస్తాం చెప్పండి. పండిన సంవత్స రాల్లో దమ్మిడీలతోసహా యిస్తూనె వున్నామా.

ధర్మయ్య : ఏం? ధర్మం యిస్తున్నారా?

ప్రసాద్ : మాటకోసం. మీసొమ్ము మాకెందుకండి. మా రెక్కలకష్టం మాకు దక్కితేచాలు.

ధర్మయ్య : మీ రెక్కలకష్టం మాకెందుకండి. మాకివ్వవలసింది మాకిస్తేచాలు...... ఏం? పండకపోతె బకాయీలు రద్దుచేయమనే న్యాయస్తులూ పుట్లకుపుట్లు పండిన సంవ త్సరాల్లో పూచికపుల్లంతైనా అదనం యివ్వరేం? అందుకు మీన్యాయం అంగీకరించదుకాబోలు. ఏం?

ప్రసాద్ : అట్లా అనుకున్నా మేం వేసిన మేడలూ మిద్దెలు పోగుపోసిన డబ్బూ దసకం ఏవండి. గట్టిగా గాలివీస్తే తలదాచుకోటానికి వీలుగా వొక్క కొంపుందేమో చెప్పండి. ఎవడు తనకోసంతాను బ్రతుకుతున్నాడో చెప్పండి. మేమూ వుంటున్నాం; చచ్చేచావూ బ్రతికే బ్రతుకూ తెలియకండా.

ధర్మయ్య : మీరు చస్తున్నారో బ్రతుకుతున్నారో అదంతా నాకనవసరం. నాకొ్కావలసింది ఆ పొలం.

ప్రసాద్ : కావచ్చు. (కళ్లెర్రబడ్డాయి)



ధర్మయ్య : ఓ ... అయితే వెళ్లొచ్చు.
కొండయ్య : యింతకీ ఏం దేలినట్టుండీ?
ధర్మయ్య : ఏం తేల్చటానికొచ్చావోయ్ ?
కొండయ్య : వూళ్లో యిల్లూలేదు. పొలంలో సేనూలేదూ. నేం దేల్చేదేంవుందిలెండి. తేలేనాటి కదే తేలిద్ది.
ధర్మయ్య : ఊఁ ... కానివ్వండి.
ప్రసాద్ : ధర్మయ్యగారూ ! వండంటి గ్రామాన్ని ఎందుకు పాడుజేసుకోవటం చెప్పండి.
ధర్మయ్య : ఆఁ ... అదే నేనూ అనేది.
ప్రసాద్ : ఊఁ ... రాజీలేదంటారా ?
ధర్మయ్య : ఏం ? అరకల కడ్డంవస్తారా ?
ప్రసాద్ : ఎవరూ ఆ పొలం దున్నటానికివీల్లేదని ఆగ్గరు తెచ్చిందీమీరే కోర్టులో వ్యవహారం కోర్టులోనేవుంది. మళ్ళీ అరకలు కట్టించిందీమీరే. ఏంచెప్పమంటారు.
ధర్మయ్య : మీరుచెప్పేదేంటిరా.అనాదినుంచి ఆ పొలంమాది.
ప్రసాద్ : అట్లా అనుకుంటె ఆదిలో అందరిది. జనం అంతా బ్రతకటానికి ప్రకృతికల్పించిన నిక్షేపాల్లో భూమిఒకటి. అతిప్రధానమైందిగూడా. ప్రకృతిశిద్ధంగా మీకేవిధమైన ప్రత్యేకాధికారాలులేవు.
ధర్మయ్య : వున్నాయ్.
ప్రసాద్ : అబద్ధం. పచ్చి అబద్ధం.
ధర్మయ్య : దానదమన వినిమయవిక్రయాలతో పుత్రపౌత్ర పర్యంతం అనుభవించమని న్యాయచట్టం యీ నిముషం వరకు అంగీకరిస్తూనేవుంది. అంగీకరించటమేగాదోయ్. పవర్నామాగూడా యిచ్చింది.

ప్రసాద్ : కసకస పనిజేసేవాళ్లు మన్ను మేసి పోతున్నారు.

ధర్మయ్య : అయితే న్యాయచట్టాన్ని చేతనైతే ప్రభుత్వాన్నే మార్చుకోండి.

ప్రసాద్ : అందాకా అరకలు వూళ్లోకి తోలించుకురారన్న మాట.

ధర్మయ్య : వీల్లేదు.

ప్రసాద్ : వీల్లేదూ?

ధర్మయ్య : వీల్లేదు!

ప్రసాద్ : వీల్లేదు. స్టే, ఆర్డరుతో అరకలు కట్టించటానికివీల్లేదు.

ధర్మయ్య : వీల్లేదని చెప్పటానికి మీరెవర్రా. నాపొలం నా యిష్టమైతే దున్నిస్తాను కష్టమనుకుంటె బీడుపెట్టిస్తాను. మీరెవర్రా అడగటానికి. యీరోజునుంచి ఎవడైనా పొలంలో కాలుబెట్టాడా నరికిపోగులేయిస్తాను. మీరాడిందాట పాడిందిపాటగావుందా? ముండేత్తుందనుకున్నార్రా. వూరుబారు సర్వనాశనం అయినాసరె వూళ్లోకి అరకలురావు. వెళ్లండి.

కొండయ్య : రాండి. చెరుకా బెల్లంబెట్టవే అంటేపెట్టుద్దేంటి.

ధర్మయ్య : పళ్లురాల్తాయి.

ప్రసాద్ : అదీచూస్తాం. కాలుదారీచట్టం వస్తుందనగానె స్వొంత సాగంటూ మాగొంతులు గొయ్యబోతున్నావు. వూరునుకాదన్ను వ్వొక్కడరకలు కట్టిస్తావో అదీచూస్తాం. పద. (వెళ్ళారు)

ధర్మయ్య : ర్రేయ్! ఢంకా బజాయించి కట్టిస్తాన్రోయ్. వూరుగాదు అయిదూళ్లు కట్టగట్టుకొచ్చి ఏం? ...... కదిలిస్తారోచూస్తా.

(తెరలో జనంపాట)

బంధించుట కెవరితరం
దండించున దెవరిబలం
ఏదిబలం ఎవరితరం
మాశక్తిని ధారవోసి
శ్రమశక్తిని వారవోసి
ఘనసంపద నిర్మిస్తామ్.
జనక్షేమం సాధిస్తామ్. ॥బం॥
మముకాదని హద్దుమీరి
తమదేనని తలమోటిన
మెలివేయును కాలుపాలం
బలిదీయును ప్రజాబలం ॥బం॥
ఏదిబలం ఎవరితరం ఏదిబలం ఎవరితరం

శ్రీరంగం : (పరివేశం హడావుడిగా, కోటుమీద పేడముద్దలు కొట్టి యున్నాయ్) హద్దూపద్దూ లేకండా పోయింది. నాశనం. "వినాశకాలే విపరీతబుద్ధీ" అని వూరు సర్వనాశనం గావటానికి వచ్చింది.

ధర్మయ్య : ఏమిటి?

శ్రీరంగం : చూడండి.

ధర్మయ్య : వీళ్ళేనా?

శ్రీరంగం : ఎవళ్ళో. కుర్రవెధవలు. ఎవళ్ళని అడిగేట్టుందా గుంపులో.

ధర్మయ్య : గుంపు. వెధవగుంపు. వెర్రిత్తిక్కోట్టుకుంటున్నారు. కాల్చేస్తా వెధవల్ని. (తుపాకి అందుకున్నాడు)

శ్రీరంగం : (అడ్డంవెళ్ళి) ఆగండి... కాగలపని గంధర్వులె తీరు స్తారు. మనవెందుకు చెయ్యిజేసుకోవటం.

ధర్మయ్య : వస్తున్నారా?

శ్రీరంగం : ఎవడికోసం.

ధర్మయ్య : మాట్లాడావా?

శ్రీరంగం : చస్తే?

ధర్మయ్య : అదేమిటయ్యా?

శ్రీరంగం : ఏమిటండీ?

ధర్మయ్య : సర్కిల్‌తోనయ్యా?

శ్రీరంగం : అదెనండి. రెండేరెండుమాటలడిగాను. మీరున్నట్టో లేనట్టో మాకర్థంగావటంలేదు. మమ్మల్ని ఆవూళ్లో వుండమన్నారా? నెత్తిన కొంగేసుకుని ఏబస్తీకన్నా లేచిపొమ్మన్నారా అని బాగా అడిగాలెండి.

ధర్మయ్య : రిజర్వుపార్టీతోనె వస్తున్నారా?

శ్రీరంగం : ఆc... వానూగీనూ. కన్నంవేయబోయేవాడు కత్తి మర్చిపోతాడటండి.

చలమయ్య : దండంపెడతా దొరగారూ?

ధర్మయ్య : ఏంరా! దొరికిందా?

చలమయ్య : ఓ! యీవరకంటె యీడ్డో ఒకమూాలుండేది. ఎనకాడుపోయేతలకే ముందాడు మింగికూసున్నేవాడు. యిప్పుడేంకరువుండి.

ధర్మయ్య : మంచిదేనా?

చలమయ్య : సరుకేం ఆచ్చాపన లేదులెండి. నిప్పుతో సమా నంగావుంది.

శ్రీరంగం : అరేయ్! గ్లాసుతీసుకురా.

చలమయ్య : అమ్మో దొరగారు పైకి అట్టావుంటారుగాని ఏమి ఎరగనట్టూ; ఎత్తినకాయ దించకండా ఒక్కగుక్కలో మింగేత్తారండే.

ధర్మయ్య : ఊఁ... ఏడిశావ్... పద. లోపలికి తీసుకుపో.
(యిద్దరూ లోనికెళ్ళారు.)

శ్రీరంగం : (వక్కపొడి నములుతూవున్నాడు. అటూ యిటూ పచార్లు జేస్తున్నాడు.)

ధర్మయ్య : (మూతితుడుచుకుంటూ, మీసం సవరించుకుంటూ వచ్చి)
ఒరేయ్! చలమాయ్. ఓరేయ్

చలమయ్య : అయ్యా!

ధర్మయ్య : అగ్గిపెట్టె. అగ్గిపెట్టె.

చలమయ్య : (అగ్గిపెట్టి తెచ్చియిచ్చాడు.)

అమరయ్య : దండవండి.

శ్రీరంగం : ఊఁ.................. ..

ధర్మయ్య : దుండాలకి తయ్యారుగేవుందిలె.

అమరయ్య : ఎందుకో రమ్మన్నారంట?

శ్రీరంగం : ఎందుకైనా తల తగిలింతరువాత తడివిచూచుకుంటె ఏంలాభమయ్యా. ఎద్దు ఎదురుతిరక్కముందె ముక్కుకు మొగతాడు పోడవాలి.

ధర్మయ్య : ఎవరిజాగ్రత్తలో వారెవున్నారు.

అమరయ్య : ఏందండి? (అర్థంగాక అవస్థపడుతున్నాడు.)

శ్రీరంగం : ఏముంది. ప్రసాదు పెద్దవాడయ్యాడుగా.

ధర్మయ్య : పెద్దవాణ్ణి జేసిందాయెనగా.

అమరయ్య : ఆఁ... నేంజేశా నాకొండ.

శ్రీరంగం : నువ్వేం జేస్తావులె. ఎంతజెడ్డా కన్నకొడుకు.

అమరయ్య : ఆఁ... కొడుకూ కోరివి.

శీరంగం : కోరివైన కొడుకుమూలా కాదంటావులె.

ధర్మయ్య : ఎందుకాకాదనాలయ్యా, లోకులసామ్మ తేరగా తెస్తావుంటె వచ్చేవరవుంటె చచ్చేవాడు లేచొస్తాడంట.

అమరయ్య : ధర్మయ్యగారూ! నేనేంజేశేది జెప్పండి.

ధర్మయ్య : అవును. చేసేదేముంది. చెయ్యాల్సిందంతా ఇదివరికె జేశేవుగా.

అమరయ్య : నేనా? నా సంగతి మీకు తెలియదు.

ధర్మయ్య : యింకా తెలియకండ ఎలావుంటుంది... అంతా మోసం.

అమరయ్య : ఆఁ... నాదా?

ధర్మయ్య : నాయింట్లో దిని యింటివాసాలు లెక్కెడుతున్నారు. అంతా దగాకోర్లు దగుల్‌బాజీలు.

అమరయ్య : ధర్మయ్యగారూ!!

ధర్మయ్య : ఏం? యింతకన్నా తడిగుడ్డలతో గొంతులుకోయటం యింకేముంటంది.

అమరయ్య : ధర్మయ్యగారూ!

ధర్మయ్య : ఏం? వున్నదానికింత వులుకెందుకు?

అమరయ్య : (కోపంతో నిలువునా వణికిపోయినాడు) వుంటెవుండాడు. పోతేపొయ్యాడు నాకు పుట్టనేలేదు యీ కొడుకనుకుంటాను. (వెళ్లాడు)

ధర్మయ్య : వీడి వ్యవహారం ఎంతవరకొచ్చినట్టు?

శ్రీరంగం : పూర్తిఅయినట్టెలెండి.

ధర్మయ్య : జాగ్రత్త. రెండోకంటివాడికి తెలియగూడదు.

శీరంగం : మూడుకళ్లున్నవాడిగ్గూడా తెలియనివ్వను.

దాసు : (ప్రవేశించి నిలబడిపోయాడు)

ధర్మయ్య : ఏంరా వచ్చా ?

చలమయ్య : (ఒకప్రక్కన వుండిపోయాడు)

దాసు : దున్నటానికి వల్లగాదని పట్టెళ్ళుదూశారండి.

ధర్మయ్య : ఎవర్రా ?

దాసు : ఆసాములు.

శీరంగం : భూస్వాములేంగాదా? వాళ్లు పట్టెళ్ళుదూస్తే చెవులు ఝూడించుకుంటూ వచ్చావన్నమాట?

దాసు : రాశ తన్నులు తినమంటారా? ఏవండి.

ధర్మయ్య : ఏంరాతింటె. నువ్వొజస్తే మట్టుకేంరా. నేలేనూ.

శీరంగం : అనుకుంటాంగాని రైతునాయకుడు పట్టెళ్ళుదూస్తే పాలేళ్ల నాయకుడు......

దాసు : అదేందండి. రైతునాయకుడేంది పాలేళ్ల నాయకుడేంది. ఎడ్లెడ్లు పోట్లాడుకొని లేగలకాళ్లు యిరగదొక్కినియ్యాని ఆరూఆరూ సమర్దులు మద్దెమాకెందుకొచ్చేనండి.

ధర్మయ్య : యిన్నాళ్లనుంచి నాయింట కుక్కతిన్నట్టుతిని...

దాసు : వూరికె తిన్లేమలెండి? రెక్కలు ముక్కలుజేసుకుంటెనే ఆబొక్కెడు మెతుకులు ఏశారు. (లోనికి వెళుతుండగా)

ధర్మయ్య ; ఆ... వూరికే తిన్లేమురా. (పోయితన్నాడు.)

దాసు : (లోనపడినశబ్దం) ఏంటండీ తన్నటం!

ధర్మయ్య : (పులిచర్మం మీదవున్న కొరడాతీసికుని) తిన్లేదురా (కొడుతున్నాడు.) తిన్లా!

దాసు : అమ్మో! బాబో చచ్చానండో శీరంగంగారూ.

చలమయ్య : బాబూ బాబూ శీరంగంగారూ.

శీరంగం : (శక్కపొడి తింటున్నాడు.) ఏం?

చలమయ్య : (అతన్ని కొట్టినట్టు బాధపడుతూ) సంపుకు తింటం న్నారండి; రాండి. (ఇంట్లోకెళ్ళబోయాడు.)

శ్రీరంగం : అరేయ్! కదిలావంటె పళ్ళూలుజారతాయ్ వెధవ. నీకెందుకురా?

చలమయ్య : (కోపంగా) యింతన్యాయమండి ఎవురైనా యింతేగా మీరుజేసేది. సంపుతారండి. తు. (బైటకి పరుగెత్తాడు.)

ధర్మయ్య : (దాసును మెడబెట్టిబైటికిగెంటాడు. దాసువచ్చి బొక్కబోర్లా పడ్డాడు.)

శాంత : అన్నా!...... (దెబ్బలన్నీ పరికించింది. ఝల్లుమండిపోయింది.) చంపుతారండి చంపుతారా? దిక్కులేనోళ్ళమనా? మీకు పిల్లాజల్లా లేరు?

ధర్మయ్య : ఏయ్! (కొట్టబోయాడు.)

శాంత : (కవ్వుమన్నది)

ధర్మయ్య : (తలతిరిగింది. ఆగిపోయాడు. ఆలోచించాడు. జాలిపడి బైట కెళుతున్న దాసు శాంతనిచూచి) ఆగు.

దాసు : రా అమ్మాయ్. రా. (వెళ్ళిపోయాడు.)

శాంత : (ఏడుస్తూ నిలుచుంది.)

ధర్మయ్య : శాంతా! యిలారా. (పదిరూపాయలు నోటుజేబులో నుండితీసి) ఊఁ... యిదిగో, యీామన్నా వండుకుతినండి. పోండి.

దాసు : రావే అమ్మాయ్.

శాంత : (వెల్లుబికిన దుఃఖముతో దాసుకేకవిని, నోటు అక్కడే పడి పోయింది. కంగారుగా వెళ్ళిపోయింది.)

ధర్మయ్య : (యింట్లోకిజూస్తూ) చలమాయ్!

శ్రీరంగం : వాడప్పుడే వెళ్ళాడండి.

ధర్మయ్య : పోనియ్ (యింట్లోకెళ్లాడు.)

శ్రీరంగం : (కిందపడివున్న నోటును మెల్లగా తీసుకుని అటుఇటూ చూచి కళ్ళకద్దుకుని జేబులో పెట్టుకున్నాడు.)

ధర్మయ్య : (మీసం సవరించుకుంటూ యింట్లోనుంచి వస్తున్నాడు.)

శ్రీరంగం : చూడండీ యీ నెత్తురుమరకలు.

ధర్మయ్య : (పనివాళ్లని పిలవటానికి లోనికిజూస్తూ) ఆఁ. ఆఁ...

తెరలో : (కారుహారన్)

శ్రీరంగం : ఆఁ... ఆఁ... నమస్కారమండి.

ధర్మయ్య : (కుర్చీచూపుతూ) దయచేయండి.

సర్కిల్ : (మర్యాదలు అందుకుని) ఏమిటండి?

ధర్మయ్య : (నవ్వుతూ) ఏం జెప్పమంటారు?

శ్రీరంగం : వూళ్లోవుండే ఆస్కారం లేకండాపోయిందండీ.

సర్కిల్ : పోదూ! మాట్లాడితె కూలోళ్లని పాలేళ్లని కొట్టడం తిట్టడం కౌలుదార్లను బలవంతాన పొలాల్లోంచి గెంటి వేయటం కదిల్తే కోర్టులు. మెదిల్తే వ్యాద్యాలు ఏమిటండీ యిది.

శ్రీరంగం : విన్నారా?

సర్కిల్ : ఏమిటయ్యా వినేది. యిదిగో...... (జేబులోనుంచి మహజరు తీశాడు.)

ధర్మయ్య : ఏమిటది?

శ్రీరంగం : ఏముందీ! గిట్టనివాళ్లెవరో కాలిముద్దర్లూ వేలి ముద్దర్లూ.

సర్కిల్ : ఏం?... ఉఁ... మీవూళ్లో మూడువందలమంది పంపుకున్న మహజరు.

ధర్మయ్య : ఎవర్రా అక్కడా!

శ్రీరంగం : ఆఁ... ఆఁ... (లోనికెళ్లాడు)

ధర్మయ్య : యింతభూమిని మేనేజ్ చేస్తున్నప్పుడు ఏవోకొన్ని గొడవలు వుంటూనే వుంటాయనుకోండి.

సర్కిల్ : ఎందుకుంటాయండి. భూమికి మీరు ధర్మకర్తలనే విషయం మర్చిపోతున్నారు. అసలు ప్రభుత్వం లేనట్టే ప్రవర్తిస్తున్నారు. ప్రభుత్వాన్నింత తేలిగ్గాచూట్టం ప్రమాదకరం.

ధర్మయ్య : (నవ్వుతూ) మీకు తెలిసిందంతా యదార్థమే అనుకుంటున్నారా.

సర్కిల్ : మరి.

ధర్మయ్య : (మళ్లీ నవ్వాడు)

శ్రీరంగం : (ప్రవేశించి రెండు చేతులు యింట్లోకిచాపి ప్రైస్ అతని చేతులో వుంచుకొనే) దేభిమొగం వేసుకొని నువ్వికడకెందుకు అదిలాతె. (తెచ్చి బల్లమీద వుంచుతాడు)

ధర్మయ్య : కాఫీ పుచ్చుకోండి మాట్లాడుదాం.

శ్రీరంగం : పుచ్చుకోండి. పుచ్చుకోండి. (ముగ్గురూ ఫలహారాలు తీసికుంటున్నారు)

(సర్కిల్ అక్కడ టేబుల్ మీద పరచియున్న అందంగా ఆకర్షణీయంగావున్న పులిచర్మాన్ని జూస్తున్నాడు)

ధర్మయ్య : ఆస్తిపాస్తులుండటంగూడా ఒకప్రాణ కంటకంగానే వుందండి. లేనివాళ్లవనే మెరుగు. తెచ్చుకున్ననాడు తింటారు. లేన్నాడు కడుపులోకాళ్లు ముడుచుకొని హాయిగా పడుంటారు.

శ్రీరంగం : అవును అడిగేవాడు లేడు.

సర్కిల్ : (పులిచర్మాన్నిజూస్తూ) ధర్మయ్యగారూ! దాన్ని మీరే వేశారా?

శ్రీరంగం : అవునండి వీరి పెదతాతగారు వేశారు.

సర్కిల్ : బావుంది.

ధర్మయ్య : దానికో క పెద్ద కథవుందిలెండి. అందుకే దాన్నంత జాగ్రత్తగా వుంచుతున్నాం.

సర్కిల్ : పెద్దల జ్ఞాపకార్ధమైనా వుంచాలిగామరి.

ధర్మయ్య : అవును. ఒకవంటరి పందికోసం వారంరోజులు పులి వాగుదగ్గర యేపెమానుమీద . కాపుగాశారట తాత గారు.

సర్కిల్ : (వినాలనిలేదు) ఉహుఁ...

ధర్మయ్య : మాటులోవుండగా ఎలుగుబంటువచ్చి వాగులో నీళ్లు తాగుతూవుందట. అదే పందనుకొని యీాయన సర్దుకుంటున్నాడు. యింతలో ఆవొడ్డు పొదలోనుంచి పంది యీావొడ్డు పొదలోనుంచి పులి రెండూ ఒకేసారి వచ్చాయ్. ఇంకేముంది... వాటిరెంటికి అగ్గిమీాద గుగ్గిలంగదా. రెండూ ఒకదాన్నొకటిచూస్తూ కూర్చు న్నాయ్.

సర్కిల్ : (వినాలని కుతూహలంగా ఉన్నాడు) అహా!...

ధర్మయ్య : వాటినిచూచి నీళ్లుతాగే ఎలుగుబంటుంది చూశారూ... గబగబావచ్చి యీాయనవున్న చెట్టె ఎక్కి యీాయనముందే కూర్చుంది.

సర్కిల్ : (బాగావింటున్నాడు) అరెరె...

ధర్మయ్య : వినండి. అపుడు తాతగారు తమాయించుకొని చెవు గూబకు బెత్తెడుతప్పించి కొట్టాడు.

సర్కిల్ : పులిని!

ధర్మయ్య : పందిని. అమాంతం పులిమీద దూకింది.

సర్కిల్ : పంది!

శ్రీరంగం : (వారిద్దరూ మాటల్లో వుంటె తను తినేవ్యవహారంలో వున్నాడు.) పందంటెపందా.

సర్కిల్ : ఆఁ... నువ్వాండవయ్యా.

ధర్మయ్య : నిలువునాపులిని అమాంతం చీల్చేసింది. రెండూ అక్కడే చచ్చేయి. యిక యీయనముందు కూర్చున్న ఎలుగుబంటుంది చూశారు; ఎప్పుడైతె చెవుప్రక్కన తుపాకిదెబ్బ ధనేల్‌మని మోగిందో అక్కడనుంచి గభీలున పడనూ...... ఉఁ... ఉడాయించింది. (అంతా నవ్వుతున్నారు.)

సర్కిల్ : వండర్, వండర్.

ధర్మయ్య : పోనీ కావాలంటె......

సర్కిల్ : చాలా రోజులుగా అనుకుంటున్నానండి.

ధర్మయ్య : అయితె అమ్మాయిగారి పెండ్లినాటికి పంపిస్తాను లెండి. యింకోదాన్ని వేసి. ఆఁ... పెద్దమ్మాయిగారి పెండ్లి తలపెట్టారటగా. ఏమఁయ్యా!

శ్రీరంగం : (నక్కిళ్ళు బిగబట్టి) ఆఁ... ఆఁ...

సర్కిల్ : (శ్రీరంగాన్ని చూచాడు.)

శ్రీరంగం : నిరుడే చేయాల్సిందని చేతిలోడబ్బులేక యీడేర్ని బిడ్డని యింట్లోవుంచుకోవల్సి వచ్చింది అని చాలా యిదిగా అన్నారులెండి.

సర్కిల్ : ఆఁ.........

శ్రీరంగం : అమ్మగారు.

ధర్మయ్య : ఆఁ... సంబంధం స్థిరపడినట్లేగా.

సర్కిల్ : కట్నందగ్గరే కొంచెం "ట్రబుల్‌సం" గావుందండి. వాళ్లేమో పదిహేను అడుగుతున్నారు. మనంపదిలో సరిపెట్టాలని జూస్తున్నాం.

ధర్మయ్య : ఆఁ అయిదువేలేగా తేడా. కానివ్వండి. ముహూర్తం స్థిరపర్చండి.

శ్రీరంగం : వరుడెక్కడండి.

సర్కిల్ : సర్వెంటు ఆఫ్ యిండియా సొసైటి......

శ్రీరంగం : అంటె అదేంజేస్తుందండి.

సర్కిల్ : (విసుగ్గా) బోర్డుమీదే వుంటుంది చదువుకోండి. (ధర్మయ్యతో) దాని సెక్రటరిగారబ్బాయ్. బి. యె. ఫస్టి య్యర్‌క్లాస్ చదువుతున్నాడు...... యిదేమిటండీ (సిగిరెట్ వెలిగించి చూస్తూ) అక్కడక్కడ ఏదో...... (శ్రీరంగం ధర్మయ్య ఒకరిమొకాలొకరు చూచుకూంటున్నారు. సర్కిల్ కుర్చీలోనుంచి లేచి) నెత్తురుమరకల్లా వున్నాయ్.

శ్రీరంగం : చిత్తం......

సర్కిల్ : ఏమిటి చిత్తం?

శ్రీరంగం : ధర్మయ్యగారి జీతగాణ్ణి

సర్కిల్ : కొట్టారా?

శ్రీరంగం : కొట్టడమేమిటి.

సర్కిల్ : చంపేశారా?

శ్రీరంగం : మీరు వస్తున్నారని విని ప్రాణాలతో విడిచిపెట్టారు గాని అసలు ప్రాణాలుతీసి ఆకేసు.

సర్కిల్ : మీమీద బనాయించాలని వాళ్లప్లాను. అంతేనా?

శ్రీరంగం : నిజం గ్రహించారు.

సర్కిల్ : ప్రభుత్వానికి చెవులూ చేతులేగాని తలకాయలేదను కుంటున్నారా?

శ్రీరంగం : అంటున్నారండి.

సర్కిల్ : (ఆలోచనలోపడి సిగరెట్ విపరీతంగా పీలుస్తున్నాడు.)

ధర్మయ్య : అన్యాయాలు చేయాలన్నా అబద్ధాలాడాలన్నా గొంతుపిసుక్కు చస్తాం.

శ్రీరంగం : మనం.

ధర్మయ్య : వాళ్ళకేమిటి చెప్పండి.

శ్రీరంగం : వాళ్ళకు! ఆస్తిపాస్తులా అడిగేపనిలేదు. పరువు మర్యాదలు అంతకుముందేలేవు. పరపతి అంటారా నత్తిని కాని బెడితే దమ్మిడి ఖరీదు జేసేవాడు ఏవొక్క డూలేడు. యిక కొంపలార్పాలన్నా ఖూనీలు చేయాలన్నా వాళ్ళకి లెక్కేమిటి చెప్పండి.

సర్కిల్ : అవుననుకోండి.

ధర్మయ్య : కదిత్తే పండ్లేపైర్లు నరికేయటం. పశువుల నోటిదగ్గర మేత కాల్చేయటం.

సర్కిల్ : జరుగుతోందా.

ధర్మయ్య : జరిగి తీరుతుంది.

శ్రీరంగం : యీరోజు గవర్నమెంటువారి ఆర్డరు చేతిలోవుండి. అరకలు కట్టగూడదురా అబ్బాయిలూ అన్నందుకే... వాడ్ని అలా చావచితకతన్ని సాగనంపారంటె—

సర్కిల్ : ఆసాములేనా!

శ్రీరంగం : ఆఁ... వాళ్ళ పనిప్పుడెలా వుందంటారు.

సర్కిల్ : ఏడి వాడెక్కడా.

ధర్మయ్య : యిప్పుడే మందేయించి కట్టుగట్టించి ఓ అరమూట పాతబియ్యంవేసి బండిమీద యింటికి పంపించాను.
సర్కిల్ : పదండి.
తెరలో జనం } (పదండి. యింతదుర్మార్గమా ఎంతమందిని కొడతాడు. ఎన్ని ప్రాణాలుతీస్తాడు.)
ధర్మయ్య : ఉఁ... అరుగో కాల్చమనండి. వాళ్లు మాటల్తో ఆగేవాళ్లుగాదు.
సర్కిల్ : (హుషారుగా పిస్టల్ దీశాడు.)
తెరలోజనం : చస్తే చచ్చాం. బ్రతికితే బ్రతికాం. యివ్వాళజస్తే రేపటికిరెండూ పదండి.
సర్కిల్ : ఆగండి. కాలు కదిపారంటె కాల్చేస్తాను. వెళ్లండి. ఎక్కడవాళ్లక్కడ వెళ్లండి. డిస్పర్స్.
తెరలోజనం : వెళ్లం యిదేదో తేలేవరకు వెళ్లం.
సర్కిల్ : మర్యాదగా చెప్తున్నా. మీలో పెద్దల్ని పంపండి. యింతమంది ఎందుకు వెళ్లండి.
(ప్రసాదు కొండయ్య దాసు చలమయ్య వస్తారు.)
ధర్మయ్య : (ప్రసాదునుచూపుతూ) వీడేనండి ప్రసాదు.
శ్రీరంగం : వీళ్లేనండి యీపూటకు యీతిప్పలు దెస్తున్నది.
ప్రసాద్ : మేమూ! కౌలుదారిచట్టం వస్తుందనగానే కౌలుదార్లందర్ని పొలాల్లోనుంచి గెంటి దయాదాక్షిణ్యాలు లేకండా కోర్టుకీడ్చి దిగువకోర్టులో గెలిస్తే ఆకసికొద్ది హైకోర్టుకు అప్పీలుజేసి దుర్మార్గంగా స్టే ఆర్డరుదెచ్చి కౌలుదార్లందరి కొంపలు......
సర్కిల్ : ప్రసాద్. నువ్వు ప్రజాసేవకుడివా.
ప్రసాద్ : కాదు.

సర్కిల్ : దేశభక్తుడివా.

ప్రసాద్ : ఆసామిని కొలుదార్ను.

సర్కిల్ : అయితె అందరివిషయం నీకెందుకు?

ప్రసాద్ : అందరి బ్రతుకుతో నాబ్రితుకు వుందిగాబట్టి. ఆస్తి పోతున్న వారిలో నేనూ ఒకడిని. ఎప్పటికప్పుడు ఏవో ఆర్డర్లుదెచ్చి పండేభూమిని పాడుపెడుతూంటె ఈ మూడు సంవత్సరాలనుండి అన్నమో రామచంద్రాని అల్లాడే వారిలో నేనూ ఒకణ్ణి. వీళ్ల పుణ్యమాఅంటూ దిన వస్తులుంటూ.

దాసు : చేసేచాకిరిచేస్తూ తన్నులుతింటూ చస్తూ బతుకుతూ.

శీరంగం : ఒరేయ్ నువ్వెందుకొచ్చావురా దాసు.

దాసు : దొరగారితో మనవి జేసుకుందామని

సర్కిల్ : (ఏమీ అర్థంకాలేదు) ఏమిటి పిసాద్.

ప్రసాద్ : వారినే అడగండి.

దాసు : అడిగేదేవుందిబాబూ పెబువులు న్యాయంఇసారిచ్చాలి.

ధర్మయ్య : అవన్నీ మేం మాట్లాడాంలేవోయ్.

కొండయ్య : ఏందండి మీరు మాట్లాడింది.

సర్కిల్ : సైలెన్స్.

దాసు : పనిజేసుకు బతక్కుండా అన్యాయింగా వృత్తిపున్నానికి యిట్టా సంపుకుతిన్నారె.

సర్కిల్ : నిన్నేనా?

దాసు : నన్నేనుండి.

సర్కిల్ : కొట్టామగదూ.

దాసు : చూడండి.

సర్కిల్ : అక్కర్లేదు. వ్రాస్తున్నాగా. చూడు. నిన్ను కొడుతున్నపుడు మీవాళ్లెవరూ లేరూ... (ఇంట్లోకి చూచాడు. ఏదో అనుమానించి లేచాడు.)

దాసు : ఎవరుండారు బాబూ మా అమ్మా అయ్యా చిన్నప్పుడే పొయ్యారు.

సర్కిల్ : వున్నవాళ్ల సంగతి చెప్పవోయ్. (శ్రీరంగం మీదగా ఇంట్లోకి చూచాడు. లోనవేదో కనపించింది. వెంటనే లోని కెళ్లాడు.)

శ్రీరంగం : ఎవరువున్నామండి.

చలమయ్య : (కోపంగా) ఎవరూ లేరూ. ఎందుకయ్యా నెయ్యన్నంతినేమారాజులు కటికబద్దాలాడతారు. నువ్వు లేవు. కుర్చీలో దేవిదేవరల్లే కూర్చుని. అయ్యోపాపం అంటానికి నోరు రాకపోయెనే. అడ్డంపో బాబూ అంటె పైగా పక్కలుజారతయ్ అన్నావ్. ఎవరూ లేరంటె పోద్దనుకున్నా యిదివూరుగాదు? న్యాయం అన్యాయం లేదు? (చలమయ్య అంటూవుండగానే సర్కిల్ పోయినవైపు ధర్మయ్య శ్రీరంగంచూచి కొంపమునిగిందని ఒకర్నొకరు చూచుకున్నారు. ధర్మయ్య కంగారుగావచ్చి శ్రీరంగం ప్రక్కన నిలబడ్డాడు. సర్కిల్ లోపలనుండి కొరడా తీసుకువచ్చాడు. అది తెగిపోయి చివర పీచు లేగివుంది.)

సర్కిల్ : (చలమయ్య ఆఖరిమాటలు చెపుతుండగానే ప్రవేశించి.) సైలెన్స ఊఁ—నువ్వెవడివిరా. గెటవుట్. ఆఁ ఏమంటారు.

ధర్మయ్య : చెప్పాగదండి యిందాకే. పోనీ ఆమొత్తం నేనే భరిస్తాను.

సర్కిల్ : ఊఁ............

శ్రీరంగం : సందేహించకండి. వీళ్ళంతాలంచాలుమేసి దొమ్మీకి తయ్యారయ్యారు.

కొండయ్య : లంచాలుమేసినా దీపాలార్పినా......

సర్కిల్ : సైలెన్స్

కొండయ్య : మీాకు తగును.

సర్కిల్ : షటప్

(యింతసేపు కొరడాసంగతి, దాసును ఎలాకొట్టింది. తానెంత బాధ పడింది. చలమయ్య ప్రసాదుచెవిలో చెబుతున్నాడు. మాటలువిన పడటంలేదు గాని అతనిముఖంలో అదంతా ద్యోతకం అవుతూంది.)

సర్కిల్ : మిష్టర్ ప్రసాద్ యుఆర్ అండర్ అరెష్టు మిమ్మల్ని అరెష్టు జేస్తున్నాను. (యీా మాటవినగానే చలమయ్య పారి పోతాడు.)

దాసు : అరెష్టు! యిదేనాబాబూ మీారిశొరిచ్చే న్యాయం.

సర్కిల్ : న్యాయా న్యాయాలు విచారించేది. ప్రభుత్వన్యాయ స్థానం.

కొండయ్య : పెభుత్వం న్యాయం ఎక్కడుందండీ అది. హు...

ప్రసాద్ : ధర్మయ్యగారి గుప్పెట్లో, మనన్తిన.

సర్కిల్ : ప్రసాద్ మీారిప్పుడు నేరస్తులుతెల్సా.

ప్రసాద్ : అవును. యిప్పుడేగాదు ఎప్పట్నుంచో నేరస్తులు గానే వున్నాం. యింకా కొంతకాలం వుంటామనిగూడా యిప్పుడే తెల్సుకుంటున్నా.

సర్కిల్ : అయితే నడవండి. ఊఁ (వాకిలివరకూ నడిపించి) ఏ 444 వీళ్ల ముగ్గుర్నీ వ్యాను ఎక్కించండి.

తెరలో పోలీసులు : కమాన్ సర్ కమాన్.

తెరలోజనం : వీల్లేదు తీసుకుపోటానికి వీల్లేదు. మా ప్రాణాలు పోయినా తీసుకుపోనియ్యాం.

సర్కిల్ : ఎందుకైనా మంచిది. అక్కడదాకారండి.

తెరలోజనం : తప్పంతా ధర్మయ్యది శ్రీరంగానిదే.

సర్కిల్ : ఆగండి.

తెరలోజనం : వాళ్ళిద్దర్ని అరెస్టు చేయాలి.

సర్కిల్ : ఆగండి.

తెరలోజనం : వాళ్ళిద్దరూ చావాలి.

సర్కిల్ : ఆగండి. మాడ్యూటి ప్రకారం యిరువర్గాల్ని అరెస్టు జేశాం. (వుత్తిదేఅన్నట్టు ధర్మయ్యవంక జూస్తాడు) యిక న్యాయాన్యాయాలు విచారించేది శిక్షించేది కోర్టు. మీది న్యాయమైతే మీరే గెలుస్తారు. కమాన్‌సార్ కమాన్.

తెరలోజనం : మాదిన్యాయం ఎప్పటికైనా మేమే గెలుస్తాం.

(తెర)

# 4-వ రంగం

## అమరయ్యగారి యిల్లు.

(అంతా వెనుకటిమాదిరే వుంది. శాంత నీళ్లబిందె బుజాన పెట్టుకొని బానదగ్గర కెళ్లింది. బిందె అక్కడదించి బానను కడిగేందుకు బైటకు తీసికెళ్లింది. అమరయ్య నిండా ముసుగ్గప్పుకొని ఇంట్లోనుంచి బైటకెళ్లాడు. శాంత బానతో యింట్లోకొచ్చి బాన యథాస్థానములో పెట్టి నీళ్లుపోస్తూ)

శాంత : జీవితమంతా - ఇంతేనా
మాజీవితమంతా - ఇంతేనా
నా యనువారు - నాకిక లేరా.
తీరని దిగులె.
తోడునీడయా ||జీవి||
చిన్నతనాన - అమ్మానాన్నా
దిక్కుమాలినా - పక్షి నిజేసెను.
కన్నులబెంచిన
అన్నయునేడు
కైదుకొట్టులో - కుములుచుండెనా ||జీవి||

వీరమ్మ : (చేతిలో నూనెసీసా. సీసా అడుగున కొద్దిగా నూనెవుంది. హడావుడిగా వస్తూనే) అమ్మాయ్! శాంత! శాంత!

శాంత : ఆఁ......

వీరమ్మ : అబ్బాయోళ్ళొత్తన్నారే! మీ అన్నయ్యగూడా వత్తన్నాడు.

శాంత : ఆఁ (ఆశ్చర్యంగా) నిజంగానా?

వీరమ్మ : ఆఁ!

శాంత : నిజ్జంగా?

వీరమ్మ : ఓ! ఏంజనం, ఏంజనం, వూరంతా వాళ్ళచుట్టేవుందెతల్లా.

(యిదంతా హడావుడిలో జరిగింది. శాంత అంతులేని ఆనందంలో వుంది. తనేంజేస్తోందో ఏం మాట్లాడుతోందో తెలియరానంతగా వుంది. చప్పట్లు చరుచుకుంటూ గుండ్రంగా గిరగిరా వీరమ్మచుట్టూ తిరుగుతూ.)

శాంత : చందమామ రావె జాబిల్లిరావె
బండిమీదరావె బంతిపూలు తేవె.

వీరమ్మ : (తెల్లపోయింది. తనూ అంత ఆనందంలోనె వుందిగాని, ఏదో తొందరలో శాంతను వదిలించుకుని గదిలో కెళుతూంది.)

శాంత : (వీరమ్మ వెనగ్గా భుజాలుపట్టుకుని వూపుతూ వుండగా)

వీరమ్మ : వుండు పిల్లా.

శాంత : కాకీ కాకీ కావ్ కావ్
శకునంచెప్పు చెక్కెరపెడతా
మాఅన్నొస్తే ముక్కెరయిస్తా
బావయ్యొస్తే ఏంయిస్తా

వీరమ్మ : ఏందా నీ పెళ్లి జేయిస్తా.

శాంత : పో! ఏందమ్మా...... ఊఁ... (బుంగమూతిపెట్టి దూరంగావెళ్ళి నిలిచింది.)

వీరమ్మ : (పకపక నవ్వింది.) యీకోడెగాలు తరువాత ఆడుకో వచ్చుగాని (బుగ్గగిల్లుతూ) కాసిని ఎర్రనీళ్లు చెయ్యాలి వుండమ్మా (లోనికెళ్ళింది.)

శాంత : (ఎంతో వుల్లాసంగావుంది. ఆ వుల్లాసంఅంతా పాటగా మారింది.)
అన్నయ్యా మా అన్నయ్యా
వస్తున్నాడూ, వస్తున్నాడూ
పాడుజైలు జేసి
నేడే నన్నుజూడ ॥అన్న॥

చందమామ కన్నా
చల్లనైన అన్నా
నాన్న కన్న మిన్నా
నన్ను జూచు అన్నా ||అన్న||
అన్నివనులామిన్న
అన్నమనసు వెన్న
దుక్కిటెద్దుకన్నా
కష్టజీవి అన్న ||అన్న||

వీరమ్మ : (లోపలనుంచి ఎర్రనీళ్లు కలిపిన చెంబుతో వస్తుంది. శాంతపాట అయిపోయింది.) అయ్యో నామతిమండిపోనూ. (ఏదో మరిచి పోయింది. బుజంమీద చూచుకొని చెంబుఅక్కడపెట్టి లోపల కెళ్ళింది. తుడుచుకు నేందుకుగామాలం తువాలు తెస్తూంది.)

ప్రసాద్ : (దానుతోపాటు హడావుడిగా వస్తూనే) అమ్మా!
(ప్రసాదు, దాను వీధిలోనుండి యింట్లోకి అడుగుబెట్టడం వీరమ్మ లోపలనుంచి రావటం! ఒకేసారి జరిగింది. ఆతల్లి అమాంతం)

వీరమ్మ : నాయనా. (అంటూనే కొడుకుని చేతిలోకి తీసుకుంది. సంతోషంలో కంటికెంట నీరుగారుతూంది.)

శాంత : (వీరమ్మ నాయనా అనగానే) అన్నా!

దాను : అమ్మాయ్! (చెల్లిని చేతిలోకి తీసుకుని తలనిమురుతు వున్నాడు. సంతోషమల్లా శాంతకు క్రమంగా కొద్ది విచారంలోకి దిగుతోంది.)

వీరమ్మ : అయ్యో నామతి మండిపోను. పదండయ్యా! వాకిట్లోకి పదండి.
(ఆ పిచ్చితల్లికి యిప్పటికిగాని ఆ చెంబు జ్ఞాపకమురు వచ్చిందిగాదు. ఆదుర్దాగా చెంబు అందుకుని ఆ యిద్దర్నీ వాకిట్లోకి నడుపుతూంది)

ప్రసాద్ : ఏమిటమ్మా! యిదేమిటే?

వీరమ్మ : అయ్యో వూరు కళ్ళన్నీ మీ మీ దేవుండయ్ రా.

(యిద్దర్నీ వాకిట్లోకి నడిపించింది. బైటదిగదుడిచింది. ఆనీళ్ళు పచ్చని చెట్టుమీదపోయటానికో ఏమో బైటకెళ్ళింది. ప్రసాదు, దాసు యిద్దరూ లోనికొచ్చారు. శాంత దిగులుగా ఒక మూల నిలబడి పోయి ఏవో ఆలోచించుకుంటోంది.)

ప్రసాద్ : ఏమిటి శాంతా! ఏమిటి?

శాంత : ఏమీ లేదు.

ప్రసాద్ : వచ్చామని సంతోషపడాలిగానీ!

శాంత : సంతోషం. ఏం సంతోషం. యీ మాయదారి లోకంలో ఎక్కడుందని. యీలోకం నాశనంగాను. ఈ లోకం వూడ్చిపెట్టుకుపోను.

ప్రసాద్ : వునూరుమంటూ కూర్చుంటే వూడ్చిపెట్టుకు పోతుందా. పనిజేసుకు బతికే లోకంరావాలని, పనివాళ్ళని గౌరవించే లోకం రావాలని, పైట నడుంకుచుట్టి, పిడికిలి బిగించి.........

కొండయ్య : మీసందువ్వి (మీసం మెలివేస్తూ యిసురుగా వచ్చాడు. అంతా విస్తుపొయ్యారు. శాంత నవ్వింది. అంతానవ్వారు.)

ప్రసాద్ : వెనకాడివి వెనకనె పొయ్యావేం కొండయన్నా!

కొండయ్య : ఆఁ...సోవఁయ్యొాదో సోదిజెప్పే.

జ్ఞానయ్య : (వస్తూనే) ఏదో మొదలెట్టాడే గందరగోళం?

ప్రసాద్ : ఏకంగా మీసం మెలెయ్యమంటున్నాడె శాంతని.

జ్ఞానయ్య : శాంతనే. (నవ్వాడు. అంతా మళ్ళీ నవ్వారు.)

శాంత : చూడు అయ్యమొకం.

కొండయ్య : ఆ మొకం బాగుందా? (ప్రసాదుని చూపుతాడు.)

శాంత : చూడన్నా.

దాసు : అహ వూరుకో సీదంతా.

శాంత : పాడుగోల మళ్లావచ్చింది. (యింట్లోకెళ్ళింది)

జ్ఞానయ్య : జైల్లో మీకెట్లాగడిచిందోగాని యీ పదిహేను రోజులనుంచి వూళ్ళో సందడే లేదురా కొండలూ?

ప్రసాద్ : జైలంతా చుట్టాలయ్యారే యీపదిహేనురోజుల్లోనే కొండయన్నకి.

దాసు : అన్నే మొగాని తాతా. ఎవురికుండా లేకపోయినా కొండయ్యదగ్గరుండేయే కట్టలకట్టలు పుగాకుబీడీలు.

జ్ఞానయ్య : ఎంతమందుండారేం జైల్లో?

కొండయ్య : ఎంతమందిలేకేమయ్యారే. జేబుదొంగలూ సారా గాళ్లు, పోలీసోళ్లు నెలపొడుగూ సచ్చేంతమందుంటేను. పొద్దుస్దీసుకొత్తె పదిమందిని.

జ్ఞానయ్య : ఎందుకో?

కొండయ్య : సారా గాయలేదని. (కొంటెగా అన్నాడు.)

దాసు : అయ్యో తెలివేవిఁరా! కాయలేదనా?

ప్రసాద్ : వాళ్ళదేవుందిలె. రాజుపాలెం రైతులొకఇరవైమంది.

జ్ఞానయ్య : వాళ్ళదేంది?

ప్రసాద్ : ఆఁ వాళ్ళదీ మనగోలకిమల్లెనే వుందిలె.

కొండయ్య : వాళ్ళదీనాందారీ గోల మన దీగోల.

దాసు : అంతేనా. గోదారిజిల్లా కూలీల్లేరూ?

కొండయ్య : ఆఁ రేటుదగ్గర కూలీలంతా సమ్మెగట్టారంటనే. ఆమొయిన పోలీసులుబోయి; కూలెంతిచ్చినా సాలూ సాలూ అని దండాలుపెట్టిందాక తన్నారంటనే. వాళ్లో ళ్లుంది తాతా. అబ్బ నాయాల్లుది దెబ్బల్లేని తావులే దనుకో.

జ్ఞానయ్య : త్చ్. త్చ్. త్చ్. పాపం.

దాసు : అన్ని దెబ్బలు తింటేమట్టుకి... హుఁ... ఏంబాబూ యింకా ఆ రైతుల్లో యిల్లేమైందో పొలం ఏమైందో అనే గుంజాటన కనపడిందిగాని. ఆఁ......

కొండయ్య : నిజమె. రైతుల్లో శానామంది దేబెమొగాలేశారు గాని మనోళ్లు గట్టిగానే వుండారు దాసయ్యా.

ప్రసాద్ : గట్టేంటి. వాళ్ళపట్టుదలెవుంటె మనం ఏనాడో బాగుపడేవాళ్ళం.

జ్ఞానయ్య : ఆఁ...!

ప్రసాద్ : వాళ్ళు ఒక్కటేమాటన్నారు తాతా. నిజంగా ఆ మాట నా జీవితంలో మర్చిపోలేను. నేనేగాదు. ఎవరూ మర్చిపోలేరు.

జ్ఞానయ్య : ఆఁ!!

ప్రసాద్ : ఏవుందండి మాకుపోను. పోతె యీ దరిద్రమెగా యిట్టారోజూ జచ్చేకంటె బతకటంకోసం పోట్లాడతాం. అంతగా చావాలిసివస్తే అంతా యేకంగా ఒకేసారి చస్తాం. ఏం మేంజస్తే మాబిడ్డలన్నా సుఖపడతారేమో

దాసు : ఆ మాటలు ఆళ్ళు సెపుతుంటె తాతా నాసామిరంగా రోమరోమం నిక్కరపొడిశిందనుకో.

జ్ఞానయ్య : హుఁ నిజంగానే మనకేముందిబాబూ పోను. పోతే యీ కష్టాలెగా.

అమరయ్య : (సకిలించుకుంటూ వీధిలోనుండి లోనికొస్తున్నాడు. అందర్ని తేరిపారజూచి. యింట్లోకెళ్ళుతూ.) ఎంతసేపైందిరావచ్చి దాసు? (సమాధానం వినకుండానే లోనికెళుతున్నాడు.)

దాసు : యిప్పుడే నే.

చలమయ్య : (వస్తూనే) ఏంబాబూ (అమరయ్య తన్నే అనుకొని తిరిగి చూచాడు. ఆగాడు) యిడిసిపెట్టె నట్టేగా యిప్పాట్లో యిడిసిపెట్టరని వూరంతా గుబ్బట్టాడి పోతందిలె.

అమరయ్య : వూరికె మాటల్తో వదిలాఁరా చలమా. సేతులు గావు కాళ్ళనుకోమని కాళ్ళావేళ్ళావడి కాసినిచ్చే బ్రి నమ్మి ఆ శీరంగం దోసిట్లోబోత్తే

ప్రసాద్ : అయిందీ? (వీరమ్మ చెంబుతో యిప్పటికి వచ్చింది. లోనికె ళుతూ సంభాషణవిని ఆగింది.)

అమరయ్య : అప్పుడే ఏంఅయింది. యింతూరిమీద వేలుబెట్టి సూపిచ్చినోడు లేడు యింతవరకి. ఏంలాభం ఎవురు సెప్తే యినేట్టుందీ. ఎవరిట్టం వారిదిగావుంది, కొంపలో!

వీరమ్మ : నువ్వు అన్నానికి రారాదంటయ్యా (అమరయ్య పలకడు) నిన్నేనయ్యో

అమరయ్య : వత్తన్నాన్లే (వెక్కిరింపుగాఅని, కదిలి, లోనికెళుతూఆగి) వాళ్ళనుగూడా రమ్మను ఎప్పుడు తిన్నారో ఏమో ఆపాడుకూడు.

వీరమ్మ : వాళ్ళకాత్త ఆలస్యంవుందిలె. (తనూవెళ్ళింది.)

ప్రసాద్ : చెప్పకుండా చెయ్యకుండా నోటురాసి తగలేశాడు. వద్దని మొత్తుకున్నా వినకుండా సరుకుతోలి అట్టాముద నష్టం జేశాడు. గేదెనమ్మాడంట. గేదెని. వాళ్ళ మాటలునమ్మి కొంపంతా కొల్లబుచ్చుతున్నాడు. (తనలోతనే గొనుక్కున్నాడు.)

చలమయ్య : అదేందో ఆరిమాటలే ఏరుబాబూ.

దాసు : యేరేంది. కొమ్ములుతిరిగిన మొగాళ్ళయినా వాళ్ళిద్దరి మద్దెపడ్డారంటె గింగరాల్ దిరగాల్సిందె.

కొండయ్య : ఎంతమంది గింగరాల్ దిరగండె ఆరొండలెకరాల పొలం ఆరలచ్చకవెల. అంతపెద్దమేడ అవిరాయంటూ యహా వాళ్ళకి. పజలసొమ్ము పంచదారతో సమానంలే.

చలమయ్య : ఎట్టయినా ఆళ్ళ తెలివె ఏరులె కొండలూ.

కొండయ్య : ఏంది. ఆరితెలివి నీతెలివి. ఆ పొలంవొదిలిపెట్టి నామాదిరి రెక్కలమీద బతకమను. తేలిద్ది.

ప్రసాద్ : రెక్కలమీద బ్రతకాల్సిన ఖర్మ వాళ్ళకేమొచ్చింది. అన్ని అమిర్చిపెట్టె ఆసాములు, కూలీలు వున్నంత కాలం, యీ న్యాయసూత్రాలున్నంతకాలం అన్ని సుఖాలు వారివె. వారి ఆశకు అంతమె వుండదు.

జ్ఞానయ్య : అవును బాబూ. ఆశకంతంఅంటె జ్ఞాపకమొచ్చింది. యెనకటికోమారాజు.........

కొండయ్య : ఆఁ ఆఁ ఆఁ...చెప్పవేశాత్రిం...(అందరూ ఆఁఆఁఆ)

అమరయ్య : (నారదెచ్చి దాసుకిస్తూ) ఒకే అబ్బాయ్ దాసూ ఇది కాస్త చీలువమ్మా! కాళ్ళకట్టతాడు బొత్తిగాపోయింది.

ప్రసాద్ : శాంతా కాసినిమంచినీళ్ళిచ్చిపో. (శాంత గ్లాసుతెస్తుంది)

దాసు : చెప్పుతాతా. మంచిశాత్రం జెప్పు.

శాంత : (పక్కనున్న కుండలో నీళ్ళుముంచి ప్రసాద్‌కిస్తుంది.)

ప్రసాద్ : (మంచినీళ్ళు తాగి గ్లాసు శాంతకిచ్చాడు. శాంత గ్లాసు అందు కొని ఒక ప్రక్కగా కూర్చుంది.)

కొండయ్య : నిజవేఁనె నీ శాత్రిం యిని శానాళ్ళయింది.

వీరమ్మ : (చాటలో బియ్యంపోసుకొనివచ్చి శాంతతో) కాస్త రాళ్ళేరమ్మా నాక్కనపడిసావ్వ.

చలమయ్య : కానియ్యావె సిన్నయ్యా.

జ్ఞానయ్య : ఊఁకొట్టండి మరి.

ప్రసాద్ : ఊఁ కానియ్.

శాంత : (రాళ్ళేరుతూ వడ్లగింజలు నోట్లో వేసుకుంటూంది.)

చలమయ్య : (నిదానంగా వినబోతూ అక్కడున్న గుడ్డలు మడుసుకుం టున్నాడు.)

జ్ఞానయ్య : అనంగనంగా వుజనీమాంకాళనే పట్టణాన్ని ఓ మా రాజు పాలిత్తన్నాడంట. ఆయనఒకానొకనాడు మంత్రిని బిలిసి మంత్రీ మంత్రీ అతాళకి అంతంయెక్కడా అన్నా డంట. అనేలకి మంత్రి వుక్కిరిబిక్కిరి అయినవాడై సమాధానం చెప్పలేక సాలినంత దిర్వ్యాన్ని గట్టుకొని శాల్లో అశ్వాన్ని దీసికొని కాకులుదూరని కారడివి చీమలుదూరని చిట్టడివి గండాభేరుండాలు ఎలుగులు పులుగులు మద్దులు మారేళ్లు జెల్లపిల్లలు రొయ్యపీతలు దాటి ఏడేడుపద్నాల్గు సముద్రాలు వెతికినా సమా ధానం దొరకలేదంటె.

కొండయ్య : యిప్పటికి దొరికిసచ్చింది !

జ్ఞానయ్య : ఆమట్న పట్నానికి వచ్చాడంట.

కొండయ్య : తిరిగి తిరిగి యినుగు పుట్టిందిగామాలు రాక సత్తాడా.

జ్ఞానయ్య : వచ్చి ఆనట దండోరా ఏయించాడంట. ఏమని మారాజుగారి బీట్లో ఎవురు ఎన్నిఅడుగుల గరికమేత్తే అన్నికరాలు మారాజుగారు బవుమతి యిత్తారెహో అని దండోరా ఏంచాడంట. ఏయించాలకె అవ్వాళ్లోనే తయారయ్యారంట. ఎవురూ? యిద్దరు ఆశగొండోళ్లు. (ప్రసాదు నవుతూ శాంతని చూచాడు.)

కొండయ్య : ఏవూర్లో లేర్లే.
దాసు : మద్దె నీదేందె.
జానయ్య : నేనెక్కువ తెచ్చుకోవాలంటె నేనెక్కువ తెచ్చుకోవాలని పోటీలమీద బీటి కొచ్చారంట.
చలమయ్య : సిన్నయ్యా, తెచ్చుకునేదేందె.
జ్ఞానయ్య : బవుమతి.
చలమయ్య : గరికమేశా?
ప్రసాద్ : డబ్బుకో ఏపనైనా సాదిస్తాం. అనుకునే వాళ్లు ఆడబ్బుకోసం ఏ గడ్డైనాగరుస్తారు. ఏం కొండయ్యన్నా.
కొండయ్య : అవున్లే
దాసు : యిచ్చేవాళ్లుంటె కొండమామ వూరుకుంటాడా?
కొండయ్య : ఏవిఁయ్యో... హుఁ... (మీసందువ్వి) బండపగల గుద్ది పావలా డబ్బులు కళ్ళజూత్తానయ్యా.
వీరమ్మ : (యింట్లోకి బైటకి వస్తూపోతూవుంటుంది. యీసారి శాంతని జూచి.) ఒశేయ్. శాంత. మట్టితింటంన్నా.
కొండయ్య : తిందువులె అమ్మా తిందువులె. నిమ్మకాయలూ, చింతపండూ పాలకాలకెలు......
శాంత : కొండమావోఁ నా సంగతెరగవ్.
దాసు : కుండెడు కూడుంచుకుని మట్టితింటం ఏందమ్మాయ్.
శాంత : ఎవురుదిన్నారయ్యా. ఆ (అని నాలక ఎల్ల బెట్టి నోరుచూపింది)
వీరమ్మ : (కొండయ్యనిజూచి, చిరునవ్వుతో) అనేమాట అనసిమాట తెలవదేంరా బొండడా.
ప్రసాద్ : ఎవర్నో ఒకర్ని ఏదోకటి అంటూవుండాలా కొండయ్యన్నా.

జ్ఞానయ్య : అబ్బే ఎవరిసేతో ఒకరిసేత సివాట్లుతింటూం టెగాని వాడికి సమ్మంగవుండదు.

చలమయ్య : తిట్టేనోరు తిరిగేకాలు వూరుకోదుగాని నువ్వు కానియ్యి సిన్నయ్యా పోవాల.

శాంత : చెప్తాతా.

జానయ్య : చెపుతానమ్మా. ఆఁ... ఆమట్టు నేంజరిగిందంటె... ఊఁ... ఊఁ... ఇప్పుడెక్కడికొచ్చాం? (అంతానవ్వారు)

శాంత : ఆళ్లిద్దరూ పోటీలమీద బీటికొచ్చారు.

జ్ఞానయ్య : ఆఁ... ఆఁ... వచ్చి అట్టాదినిఅట్టాదిని నాలుగంళ్ల పొద్దుదాకా దిన్నారంట.

కొండయ్య : అబ్బా!

దాసు : ఎహె నువ్వుండు.

జ్ఞానయ్య : తినాలకె నవిరికితిరక్క. (ప్రసాదు శాంత నవ్వారు)

చలమయ్య : ఆఁ.? (నోరు దెరిచాడు)

కొండయ్య : కాదుమరి.

వీరమ్మ : త్చు. త్చు.

దాసు : తిరక్కా ?

జ్ఞానయ్య : నవిఁరికి తిరక్క పొట్టలు ఛేరికుండలల్లే వుబ్బకరాను, చావను.

చలమయ్య : చచ్చారూ?

కొండయ్య : సావలా పాణాలిడిశారు... యిందుగ్గాదంటయ్యా మదమాంసాలు తినేవోళ్లకి మెదురు తక్కువనేది. అయితె శలమయ్యా వుండంతసేపూవుండి. మాంచి మొనగాడి ముండమోపిపెళ్ళి పశినవే. (అందరూనవ్వారు)

చలమయ్య : (తల గోకుకుంటూ) అదిగాదు లె.

కొండయ్య : యింకేందయ్యో! ఇకబోయ్యా! (అందరూ నవ్వారు)

చలమయ్య : (బట్టలు మడుచుకొని వెళ్ళిపోయాడు)

వీరమ్మ : అన్నానికి లేవండయ్యా!

పిసాద్ : లే దాసూ... తాతా...

జ్ఞానయ్య : వెళ్ళొస్తా బాబూ.

వీరమ్మ : నువుగూడారావె సిన్నయ్యా.

పిసాద్ : భోంచేద్దాంరావె... కొండయన్నా.

(భోజనం ముగించుకొని చుట్టగాల్చుకొని అమరయ్య వీధిలోకెళ్ళాడు. ప్రసాదుగూడా ఎందుకో బైటకెళ్ళాడు. యింతలో దాసు తాతతో ఏదో చెప్పాడు. యింతలోకె ప్రసాదువచ్చి.)

పిసాద్ : ఊఁ... రండీ.

జ్ఞానయ్య : బాబూ వాళ్ళకోవుత్తరంముక్క రాయరాదు.

పిసాద్ : ఎవరికె?

జ్ఞానయ్య : అదే! శాంతని అడిగిపొయ్యారె......

ప్రసాద్ : వాళ్ళకా (ఆలోచిస్తున్నాడు.)

జ్ఞానయ్య : ఎదిగినబిడ్డని అట్టావుంచటం.......

ప్రసాద్ : మంచిదిగాదనుకో.

జ్ఞానయ్య : దాని దరిద్రమేమో. తల్లిని దండ్రిని యిద్దర్ని కరువుజేసుకునే బాబు. నిజంగా అన్నజైలుకుబోయి ఆదరించే దిక్కులేక అల్లాడతంటె సమయానికి మీాయమ్మ దగ్గరికి తియ్యబట్టి సరిపోయె. లేకపోతె దానిబతుకు ఏంగాను బాబు.

ప్రసాద్ : ఏదిచెయ్యటానికి ఎటూ తేలిచావకపోయెగా యీా పొలంగోల.

దాసు : యీా వాయిదాతో అటోయిటో తేలుద్దనెగా పీడరూ.

ప్రసాద్ : అన్నాడనుకో.

జ్ఞానయ్య : ఏమీలేదుగాని బాబూ. దాన్నొక యింటిదాన్ని జేసి దానింటికిదాన్ని బంపితె దానిబతుకు అది బతుకుద్ది.

ప్రసాద్ : యిపుడుంది దానిల్లుగాకపోయిందంటగాని, రండి తరువాత మాట్లాడుకుందాం.

జ్ఞానయ్య : అరేయ్. దాసూ

దాసు : ఆఁ ఏందే.

జ్ఞానయ్య : పంతులు బాపయ్య పెజ్జీతగాడు మానుకున్నాడంటరా.

దాసు : నేనుంటానే

జ్ఞానయ్య : సర్లే. అన్నంతినిపోయ్ మాట్లాడుకో. (అందరూ కదిలారు.)

—(తెర)—

## 5-వ రంగం

ధర్మయ్యగారి యిల్లు.

(అంతా వెనకటిమాదిరిగానె ధర్మయ్య చాలా చికాగ్గా వున్నాడు)

శ్రీరంగం : (ప్రవేశించి) నమస్కారమండి.

ధర్మయ్య : అప్పుడే వచ్చావేం?

శ్రీరంగం : యిప్పటికి తెమిలిచచ్చింది

ధర్మయ్య : చావదు. ఇప్పటికేగాదు. ఎప్పటికీ తెమిలిచావదు.

శ్రీరంగం : ఊఁ... యిందుకె చెప్పేవాడికి చేసేవాడు లోకువన్నారు.

ధర్మయ్య : ఎందుకయ్యా! వారం రోజుల్నాడు వందపట్టుకెళ్లినందుకా ఒకణ్ణి పంపనందుకా. అన్నారంట. అన్నారు. పైకందగ్గర చూపేశ్రద్ధ పనిమీదచూపొద్దూ.

శ్రీరంగం : చూపక నేనేం జేస్తున్నానంటారు.

ధర్మయ్య : ఏమీ చెయ్యటంలేదులె ఎందుకు.

శ్రీరంగం : నన్నేం చావమన్నారా చెప్పండి.

ధర్మయ్య : నీ ఖర్మేంగాలింది. యీ వూరుగాకపోతె యింకో వూరు. అదీ గాదనుకుంటె కోర్టువాక చెట్టు నీడైనా చాలనుకుంటావు.

శ్రీరంగం : మీరట్లా అంటావుగాని.

ధర్మయ్య : అనేదేముంది. వూరుమీద వూరుపడినా కరణం మీద కాసుపడదని...

శ్రీరంగం : ఊఁ...

ధర్మయ్య : నీ ఎద్దులుబండ్లు కదలందేముంది. నాకోసం మీరె

వరూ ఏళ్ళిమా తీసుకోనక్కరలేదులె. నా విషయం నేను చూచుకుంటాను. చేసుకుంటాను.

శ్రీరంగం : బైట ఎలావుందో ఏం జరుగుతుందో మీరు తెల్సుకోకండా.

ధర్మయ్య : తెల్సు. నాకన్నీ తెల్సు. నేనంత కళ్లుమూసుకూర్చోటంలా నీమాదిరి.

శ్రీరంగం : ధర్మయ్యగారూ! వూరు వల్లయివేటుబోయి వూళ్లో పరపతిబోయి పోతినోటుగూడా వాయించుకునే దిక్కులేక...

ధర్మయ్య : లేదనుకోటం ఎందుకు? అన్నీబోయినా నన్ను బట్టావుగా.

శ్రీరంగం : ధర్మయ్యగారు నేను మిమ్మల్ని బట్టానా?

ధర్మయ్య : అక్షరాలా.

శ్రీరంగం : ఆరోజు కాదన్నకొద్దీ కోర్టుకెక్కింది మీరు.

ధర్మయ్య : కోర్టుకీడ్చింది మీరు.

శ్రీరంగం : నేనా?

ధర్మయ్య : మరి నేనా? నేనటయ్యా!

శ్రీరంగం : ఊఁ...ఎంతనాదనుకొని పైనవేసుకొని ప్రాకులాడినా చివరికి అనవలసినమాట అన్నేఅన్నారుగా ధర్మయ్యగారూ ఊఁ...సరెకానివ్వండి. నిజా నిజాలు ఎప్పటికైనా తెలియవా అప్పుడైనా అనకపోతారా.

ధర్మయ్య : అప్పుడైనా యిప్పుడైనా ఎప్పుడైనా ఎవర్నేం అనవలసిన పన్నాకేం లేదులె.

శ్రీరంగం : యీ ముదనష్టపు వ్యాద్యంలో తలదూర్చిం దగ్గరనుంచి వేళకుతిండి తిప్పలనక కంటిమీద కునుకెట్లాటిదో

పోక ఎన్ని బాధలు పడుతున్నానో ఎంతమంది కాళ్లా గడ్డాలు గరుస్తున్నానో.

ధర్మయ్య: ఎందుకూ అన్ని బాధలూపడి మీరుసాధించిన ఘన కార్యమేదో ఒక్కటివేలుమడిచి చూపండి? ఒక్కటి?

శ్రీరంగం: కాలం కల్సిరానప్పుడు. మనం ఏంజేస్తాం చెప్పండి. యీ మూడురోజులనుంచి కాలికిబలపం కట్టుకొని ఎన్నివూళ్లు తిరిగానో....

ధర్మయ్య: ఏంలాభం. నలుగురు మనుషులు దొరకలా. వూళ్ళల్లో మనుషులే లేకుండా పోయారు.

శ్రీరంగం: ఏంచెప్పమంటారు. చుట్టుప్రక్కల వూళ్లు విపరీతంగా భయపడి పోతున్నాయి.

ధర్మయ్య: అవున్లేవయ్యా ఎవడన్నావింటె నవ్విపోతారు. భయపడుతున్నారట. భయం.

శ్రీరంగం: అవునండి. మనూర్రావాలన్నా మనింట్లోవుండాలన్నా ప్రతివెధవా పారిపోతున్నాడు. వూళ్లోవాళ్లుకొడతారని, చంపుతారని............

ధర్మయ్య: వాళ్లు లక్షుంటారు. నీ తెలివితేటలు ఏమైనట్టూ?

శ్రీరంగం: చెప్పానూ. అలాంటి పిచ్చివేషాలేమీ జరగవురా అబ్బాయిలూ అని.

ధర్మయ్య: ఎన్నోన్నని చెప్పారు.

శ్రీరంగం: కనుక్కోండి.

ధర్మయ్య: ఎందుకూ............ఇంతకీ ఎక్కడా దొరక నట్టేగా.

శ్రీరంగం: ఒకవిధాన దొరికాడా! యుగంధర ప్లానువేసి భగీ

రథ ప్రయత్నంజేస్తే చివరకి వొకడు చిక్కాడు. వంటకి.........

ధర్మయ్య : వంటకా?......అదైనా?

శీరంగం : ఆఁ... చెయ్యిదిరగా చేసేవాడేనటలెండి. మనిషి గూడా చాలామెత్తనివాడని.

ధర్మయ్య : ముందు మెత్తగానె వుంటారులె. నిన్నటిదాకా చెలమాయ చచ్చినకుక్కల్లే పడుండలా. నేడుగా నెత్తికొక్కెమ్మొచ్చింది. మరి వాడ్నెప్పుడు రమ్మన్నా.

శీరంగం : చెప్పాలెండి.

ధర్మయ్మ : ఎప్పుడని?

శీరంగం : రేపు... రేప్పొద్దు పొడిచేసరికి పంపించమన్నా.

ధర్మయ్య : ఎవరితో.

శీరంగం : వున్నాడులెండి. శీరాంపురంలో మావేలు విడిచిన మేనల్లుడు.

ధర్మయ్య : వుంటె.

శీరంగం : వాడిజీతం అదీ మాట్లాడి

ధర్మయ్య : పంపించమన్నావ్. నువ్వుమాత్రం మాట్లాడలా

శీరంగం : అక్కర్లేదులెండి. ఆవూరు కరిణీకం వాడిదె. మంచి మాటకారిగూడాలెండి.

ధర్మయ్య : చచ్చాడులె నోర్ముయ్యవయ్యా!

శీరంగం : అదిగాదండి.

ధర్మయ్య : ఏదిగాదండి... ఏదిగాదు. నీవల్ల ఏదిగాదు. ఎంత డబ్బు ఎంతడబ్బు వూళ్లో వెధవలుఅట్లా నీవిట్టానా. నన్నన్నిందాలా నాశనం జేస్తున్నారు. మీరంతా నన్ను

సాగనంపాలని జూస్తున్నారు. నాచావు కోరతన్నారు. నేనుండటం ఏ వక్కడికీ యిష్టంలేదు.

శ్రీరంగం : (మెల్లగా ఆఫీసుగదిలోకి జారుకుంటున్నాడు)

ధర్మయ్య : కానివ్వండి. కానివ్వండి. ఆరోజేవస్తే... ఊఁ... అటెక్కడికి...... విజయవాడ వెళ్లాలి.

శ్రీరంగం : ఎప్పుడూ?

ధర్మయ్య : ఇప్పుడే.

శ్రీరంగం : పని?

ధర్మయ్య : పనుండబట్టేపోవాలంటుంది. స్టే ఆర్డరునురద్దుజేస్తూ.

శ్రీరంగం : ఆఁ రద్దుజేస్తూ......

ధర్మయ్య : సాగుజేసుకు నేందుకు వాళ్లకివర్మిషన్ ఇచ్చిందికోర్టు.

శ్రీరంగం : ఆఁ క్రిందికోర్టు తీర్పునే ఖాయంజేసిందన్నమాట.

ధర్మయ్య : ఎందుకు చెయ్యదు. న్యాయసూత్రాలు తెలియని వాళ్లంతా న్యాయాధిపతూలౌతూంటె.

శ్రీరంగం : హుఁ......

ధర్మయ్య : అధికోత్పత్తికి ఆటంకమట ఆటంకం.

అమీనా : (వస్తూనే) నమస్తే సార్!

ధర్మయ్య : ఆఁ... ఆఁ......

శ్రీరంగం : ఓ! అమీనాగారా... రండి. రండి.

అమీనా : వేలం నోటీసు తెచ్చా సార్.

ధర్మయ్య : ఆఁ

అమీనా : వేలం నోటీసులు.

ధర్మయ్య : ఏవీ?

శ్రీరంగం : ఆఁ ఆఁ అవెలెండి.

అమీనా : తొందరగా ఆచాటింపువిషయంజూస్తే నేవెళ్తానండి.

శ్రీరంగం : భోంచెయ్యకుండానే.

అమీనా : ఆఁ యిప్పుడిక భోజనం కుదిరేట్టులేదు లేండి.

శ్రీరంగం : అమ్మా, అకాలం అయిపోతేనూ. అన్నందినకుండా మిమ్మల్ని ప్రాణంవుండగా బోసిస్తానా?

అమీనా : కాదులెండి. యింకా మూడుమూళ్లున్నాయ్.

శ్రీరంగం : సరే మీయిష్టం పదండి. మాట్లాడుదాం. (వెళ్లు తున్నారు)

ధర్మయ్య : యిదిగో శ్రీరంగం.

శ్రీరంగం : ఆఁ ఆఁ.............

ధర్మయ్య : మాట. (శ్రీరంగం వచ్చాడు.) కరణం ఏమన్నా పేచీ పెడతాడేమో?

శ్రీరంగం : ఆయనేం పెడతాడుపేచీ యీ విషయంలో ఆయనా గొంతువరకున్నాడు.

ధర్మయ్య : అంటె?

శ్రీరంగం : ఏవుందంటే జమాబందిమామూళ్ళమీద, జాయింటు పట్టాలమీద పోరంబోకు చెట్లమీద

ధర్మయ్య : ఆఁ ఆఁ ఆఁ

శ్రీరంగం : పది పన్నెండొందలు గిడుతుండేవండి.

ధర్మయ్య : ఆఁ............

శ్రీరంగం : ఆఁ మరీ వచ్చే పొయ్యేవారందరికీ కోళ్ళని కొక్కరాళ్ళని విందులని వీరంగాలని ఎట్లా వెళ్లదీస్తున్నాడంటారు.

ధర్మయ్య : ఉహుఁ...సరె జాగ్రత్తగా సరిజేసుకురా.

శ్రీరంగం : ఉఁ...ఉఁ (వాకిలిదాకా వెళ్లాడు.)

ధర్మయ్య : చూడూ, మరీయన విషయం.

శ్రీరంగం : ఆఁ ఆఁ...... (వెళ్ళాడు.)

ధర్మయ్య : (అటుజూస్తూ) జీతగాళ్ళని మాట్లాడుకొచ్చినట్లే జేశేవ్. (అంటూపచార్లుజేస్తున్నాడు. సైటుకారుహారనుమోగింది) ధర్మయ్య అటుచూచాడు.) నమస్తే! నమస్తే

సర్కిల్ : నమస్తే!

ధర్మయ్య : దయచేయండి. దయచేయండి.

సర్కిల్ : దయచేసేట్టేవుంది. యీ వూరు మా ప్రాణాలు తోడేట్టువుంది.

ధర్మయ్య : అందుకేగదండి అన్నికబుర్లంపాను.

సర్కిల్ : మీకేం మీరెన్నికబుర్లైనా అంపుతారు.

ధర్మయ్య : అంపక, అనవసర ప్రచారాన్ని అరికట్టక చేతులు ముడుచు కూర్చుంటామంటండి.

సర్కిల్ : మీరెందుకూర్చుంటారు.

ధర్మయ్య : ఎలాకూర్చోవండి. ఎవరికైనా...

సర్కిల్ : మీరుకూర్చోరు. మమ్మల్నికూర్చోనూ కూర్చోనివ్వరు. అస్తమానం చస్తున్నాం మీ పిటిషన్లుతో మహా జర్లతో.

ధర్మయ్య : మహాజర్లేనా! వాళ్ళమాటలు, మీరు లంచాలకి, తలవంచారని

సర్కిల్ : వాగేస్తున్నారు.

ధర్మయ్య : వూరంతామోతమోగిస్తున్నారు. కాదంటె; కయ్యానికాలుదువ్వుతున్నారు. అన్నిప్లాన్లూ వేస్తిమి, అంత హడావుడిజేస్తిమి. చివరికి ఏనుగుసామెత జేస్తిమి.

సర్కిల్ : చేశాం. అనవసరంగా వాళ్ళని అరెస్టుజేశాం, లేనిపోని రిస్కునెత్తికి జుట్టుకున్నాం.

ధర్మయ్య : ఏం మాటలండి.

సర్కిల్ : నావా! మీపాయింటు ఏది? ఏకోర్టులో నిలిచిందో మీరు చెప్పండి?

ధర్మయ్య : దానంతటది ఎలాసిలుస్తుందండి.

సర్కిల్ : నోట్లోనాలిక లేని పొట్టకూటి వెధవల్ని పోగుజేస్తిరి వాళ్ళతో నానాయాతనాపడితిమి. తీరా బోనెక్కి స్తే త్తె. త్తె. తె. మ్మె. మ్మె. మ్మె.

ధర్మయ్య : ఏమైనా పోయారని పోయినమాటకాదుగాని దేని కైనా ఆ యింగ్లీషువాళ్ళని చెప్పుకోవాలండి. వాళ్ళ మతలబే వేరు.

సర్కిల్ : వాళ్ళమతలబును. వాళ్ళన్యాయ సూత్రాలను కాద న్న దేమున్నదండి?

ధర్మయ్య : కాదన్నారా కావాలన్నారా అనేదికాదండీ. కావ ల్సింది కార్యసాధన. ఏదోవిధంగా యీ జనాన్ని అదు పులో పెట్టంది కాలుకదపటానికి వీలుండదంటాను.

సర్కిల్ : వీలుండదనుకుంటె కానివ్వండి. పాపం అనివాదిలే స్తే

ధర్మయ్య : పాపం అనుకోబట్టే పెచ్చరిల్లిపోతున్నారు.

సర్కిల్ : అందుకే కానివ్వమంటున్నాగా; పై ఆఫీసరుగూడా మంచివాడొచ్చాడు.

ధర్మయ్య : ఆఁ!

సర్కిల్ : ఆఁ. అయినాచేసేది కాస్తఘట్టి ప్రయత్నంగానె చెయ్యాలి.

ధర్మయ్య : గట్టిప్రయత్నమే చేద్దాం. కాకపోతె వెయ్యానుకున్న చోట యింకోవెయ్యి. లేవండి. యీరోజే ఆర్డరు

వేయించుకొద్దాం. ఏమైనాసరె వాళ్ళ ఆర్డరు రద్దు చేయించాలి.

సర్కిల్ : ఆగండి. పెద్దఆఫీసర్లతో కూడిన వ్యవహారం. మన ఆదుర్దాకొద్దీ పనులు జరుగుతాయా?

ధర్మయ్య : ఏం! పర్మిషన్ పుట్టించలేమంటారా?

సర్కిల్ : ఏదో కారణం చూపెట్టాలిగా.

ధర్మయ్య : కారణం లేకపోవటమేం. యిదంతాఏవిటంటారు. వీళ్ళంతా వూకుమ్మడిగా నా భూముల్ని ఆక్రమించుకోవటం నా యింట్లోపనిపాటలు చేయకుండా నన్నన్ని విధాల వూరంతా వొత్తిడిచెయ్యటం కారణంకాదంటారా? నా ధన ప్రాణమానాలకు రక్షణేవిటి.

సర్కిల్ : అంతదూరం ఆలోచించాల్సింది ప్రభుత్వంఅనుకోండి.

ధర్మయ్య : ప్రభుత్వం అయినా పెద్ద ఆఫీసరైనా యీజబ్బు నాతోనె పోతుందనుకుంటున్నారా!

సర్కిల్ : ఎవరేమనుకున్నా రోజులు మారాయ్ సార్.

ధర్మయ్య : ఏం మారాయండి యీరోజుకి వందలెకరాలకి శిస్తు చెల్లిస్తుందెవరు? ఇన్‌కంటాక్సిలిచ్చేదెవరు? సూపర్ టాక్సెకట్టేదెవరు? మరణసుంఖాలు ఎక్కడ వసూలు అవుతున్నాయ్?

సర్కిల్ : నిజమె మరి.

ధర్మయ్య : కోట్లకొద్దీ అప్పుకావలసిన్నాడు మేమా? మాకు రక్షణివ్వాల్సొచ్చేప్పటికి రోజులు మారాయంటారు? ఏమిటండీయిది.

సర్కిల్ : (నవ్వాడు) మీరొచ్చింది స్టేషనుదాకనెగా సార్.

(నవ్వాడు) సరె మీ ప్రయత్నంలో మీరుండండి. నేతీసుకునే జాగ్రత్త నేనూ తీసుకుంటాను.

ధర్మయ్య: ఎప్పుడో తీసుకోవటంగాదు. లేవండి. చెప్తా.

సర్కిల్: యిప్పుడే వెళ్దాం అంటారా.

ధర్మయ్య: ఆఁ...

సర్కిల్: (ఆలోచిస్తున్నాడు) యిప్పుడు కుదిరేట్టులేదే.

ధర్మయ్య: ఏమిటంటారు?

సర్కిల్: శలవు బెట్టబోతున్నానండి. యిపుడు మళ్లీ యీవ్యవహారంలో తలదూరిస్తే యింటిపనులు కుంటుపడేట్టున్నాయి.

ధర్మయ్య: అదేమిటండీ మీరు వుండగానే యీ వ్యవహారం అటోయిటో తేల్చేద్దాం అనుకుంటుంటె.

సర్కిల్: నిజమెమరి ఏంచెయ్యను.

ధర్మయ్య: ఏమంత ముంచుకొచ్చిందంటారు. ఎందుకు శెలవు పెట్టడం.

సర్కిల్: పెద్దమ్మాయిపెండ్లి తలపెట్టానండి. నిన్ననే సెటిలైంది.

ధర్మయ్య: ఆహాఁ... (మొఖం ముడుచుకుంది)

సర్కిల్: పది రోజులనుంచి నానా అగచాట్లూ పడితే 15 వేలు ఇస్తేనేగాని వీల్లేదనిమొండికేస్తే సరె పోనీలెమ్మని అంగీకరించి రేపు 18వ తేదీ ముహూర్తం స్థిరపర్చాం.

ధర్మయ్య: శుభస్యశీఘ్రం... కానివ్వండి. ఏంజేస్తాం.

సర్కిల్: ఎందుకు ప్రసాద్‌వాళ్లను మునసబు యింటికి పిలిపించిపెట్టవలసిన నాలుగు చివాట్లూ గట్టిగా పెట్టేవెళతాలెండి... ఊఁ... మరి మీరూవచ్చి ఆ పెండ్లి నాలుఘడియలూ వుంటె......

ధర్మయ్య : ఓ... తప్పకండానూ, మీమాట కాదంటానా.

సర్కిల్ : అన్ని విషయాలూ అక్కడ్నే తేల్చేద్దాం. మీరు కొంచెం ఘట్టి ప్రియత్నంగా న రండి.

ధర్మయ్య : ఆఁ... ఆఁ...

సర్కిల్ : నమస్తే!

ధర్మయ్య : ఆఁ...ఆఁ... నమస్తే! నమస్తే! పదండి. (సర్కిల్ వెళ్ళాడు. ధర్మయ్య వాకిలిదాకాపంపి ఆ తేజూస్తూ) గుఱ్ఱంగుడ్డి దైనా దానాకి తరుగు లేదని చేసింది లేకపోయినా చేతులుమాత్రం చాపుతుంటారు. పెండ్లితలపెట్టాడంట. పెర్రి. (అటూయిటూ పచారు జేస్తున్నాడు.)

శ్రీరంగం : ఆఁ... యిక లేవండి.

ధర్మయ్య : ఏఁవన్నాడు. పెట్టాడా సంతకం.

శ్రీరంగం : లక్ష దెప్పుళ్లు దెప్పాడు.

ధర్మయ్య : కరణం.

శ్రీరంగం : ఆఁ! ఆయనకి కష్టంవచ్చినప్పుడు ఎవరూ ఆదుకో లేదట. ఎవరికే దొచ్చినా తానేదో......

ధర్మయ్య : మిడికాడులె వద.

శ్రీరంగం : చివరికి చేశాడులెండి.

ధర్మయ్య : మరి... యీయన

శ్రీరంగం : చాటింపు వేసినట్టు రాసుకుపొయ్యాడులెండి.

ధర్మయ్య : అదిసర్లేవయ్యా! ఎంతలో సరైయ్యాడూ అని.

శ్రీరంగం : ఆఁ ఎంతా? ఏభై

ధర్మయ్య : వెళ్ళాడా.

శ్రీరంగం : ఆఁ వెళ్ళక ఇక్కడి కెందుకూ, వెధవ బేరం. మీరు లేవండి.

ధర్మయ్య : లేవటంసరేగాని ముందాబ్యాంకిఎక్కౌంటుచూడు.
శ్రీరంగం : ఏం జూడమంటారు.
ధర్మయ్య : డబ్బు ఎంతుందో చూడవయ్యా
శ్రీరంగం : చూసేదేముంది. పాతిక వేలున్నాయ్.
ధర్మయ్య : హూఁ...పాతిక వేలదాకా దేకింది? సరెభోంచేసిరా.
శ్రీరంగం : ఆఁ యిప్పుడిక భోజనంలేదూ నిద్రాలేదు.
ధర్మయ్య : ఊఁ...అదేమిటి! అన్నం తినకండానా? యిది యివ్వాళటితో తెగేదా చచ్చేదా
శ్రీరంగం : అంతగా అయితె అక్కడే ఒక అణా అరటివండ్లో ఏవో సరిపెట్టుకోవచ్చులె పదండి.
ధర్మయ్య : సరె; పద. ఎన్నివేలు ఎదురుపెట్టినాసరె యీ ఆర్డరును రద్దుచేయించాలి. (లోనికళ్లారు - తెరలో పాట)

రొక్కముందని మిడిసిపడతావా
భోగాలగని - వా
పెక్కు జగతిని ధిక్కరించేవా.
మిట్టిపడి కాలాహి చీమలు
చుట్టబడి నశియించినట్టులు
నిక్కముగ చిక్కులకు చిక్కి
స్రుక్కెదవు నిక్కకుర కుక్కా ॥నీతి

(పాట అయిపోతూండగా ధర్మయ్య, శ్రీరంగం బైటకళ్తారు)

(తెర)

# 6-వ రంగం

(ఉరుములు మెరుపులతో వానకురుస్తోంది. కోడి గూసింది వాన వెలిసింది. ఎక్కడో ఒకగంభీరమైన స్వరం యిలా వినిపిస్తోంది)

కుక్కు-రో యని తొలికోడి కూసెనపుడె
వృక్షములనుండి లేచిన పక్షులటుల
మసగచీకటి ముసుగులో మసలుచున్న
పేదలోకము బ్రతుకును వెతకసాగ.

(తూర్పున పొద్దు బొడుస్తూంది. రైతులంతా ఏరువాక హడావుడిలో వున్నారు)

**శాంత :** (పసుపు కుంకుమతోవున్న పళ్లెం తీసుకొని యింట్లోనుండి బజారు వైపుకు వెళ్లుతూ)

– పాట –

| | |
|---|---|
| సాగవయ్యా ఏరువాక | ఆసామి |
| ఆపవయ్యా కరువుల రాక | ,, |
| నీటుగ తలపాగ చుట్టీ | ,, |
| కోటేరు తీరిచి దిద్ది | ,, |
| చేలన్నీ అరకలమయమూ | ఆసామీ |
| సాలుకు వెయిపుట్లనుమోయీ | ,, |
| పంటలు మాబాగా పండి | ,, |
| యింటింటానందంనిండి | ,, |
| ఆగిపోవు నాకలిశోకం | ,, |
| అన్నదాత అంటది లోకం | ,, |

(పాట పూర్తికాగానే పళ్లెం చంకలోపెట్టుకొని వీధిలో కలుతుంది)

**ప్రసాద్ :** (బుజాన చంద్రకోల, తలగుడ్డ, చేతిలో ములుగర్రతో శాంత

కెదురొస్తూనే) ఓహో! యింకా బొట్లూ బోణాలకాడె
వుండె వ్యవహారం ... అమ్ముందా?

శాంత: (నవ్వింది ముందు) లేదు. విత్తనాల జొన్నలు తీసుకురా
బోయింది. (అంటూ సాగింది)

ప్రసాద్: (శాంతను ఆదోమాదిరిగాజూస్తూ) అబ్బో సాలుకు వెయ్యి
పుట్లు పండాలిగామాలు యీ సంవత్సరం.

శాంత: (తిరిగి ప్రసాదువంక చూస్తూ) ఓఁ (నవ్వుతూ వెళుతూండగా)

ప్రసాద్: ఆఁ ... (అంటూ అడ్డంవస్తాడు)

(యింతలో వీరమ్మ వస్తుంది)

వీరమ్మ: కానియ్యమ్మా కానియ్యవే.

ప్రసాద్: (కంగారుగా యింట్లోకెళుతాడు. శాంత బైటకెళుతూంది)

వీరమ్మ: ముసలయ్యొస్తే అరుస్తుంటాడు. ఎంత పొద్దుకాడ
లేసినా చింతకుంటకాడె అన్నట్టుందేమె పాడైన పని.
(యింట్లో కెళ్ళింది)

ప్రసాద్: (గుడ్డచుట్టివున్న మువ్వలపట్టెడ తీసుకువచ్చి దులుపుతూ శుభ్రం
జేస్తుంటాడు. యింతలో కొండయ్య వచ్చాడు.) గొఱ్ఱుకట్టించ
టం అయిందా?

కొండయ్య: ఓ.

ప్రసాద్: గింజలుమాడుచక్కలా సమానంగారాల్తున్నాయయ్యా?

కొండయ్య: ఓ. ముప్పైర్ష.

ప్రసాద్: అయితే కాస్త గొఱ్ఱుకుఅంటురాయి. అదిగో సీసా.

కొండయ్య: (సీసాదగ్గరకెళుతున్నాడు)

ప్రసాద్: ఆ యారగట్ట సామానుగూడా తీసికెళ్ళి ఒకేసారి
కోటేరేస్తే పోద్దిగా?

కొండయ్య: (యారగట్ట సామాన్లుతీస్తూ) దాసయ్యేడి బాబూ

ప్రసాద్ : జీతంలో కెళ్ళాడుగా.

కొండయ్య : ఎళ్లాడూ? (అంటూ బైటకెళ్ళాడు.)

వీరమ్మ : (యింట్లోనుంచి వీధిలోకెళుతుంది)

ప్రసాద్ : ఆఁ... ఎక్కడికమ్మా!

వీరమ్మ : చంద్రమ్మగారి కోటమ్మని పిల్లి పిసర్లడిగితె గోగిత్తుల్లో రుకుతయ్యత్తాంది. య్యీయిచ్చి అయితెద్దావఁని.

ప్రసాద్ : అమ్మా! పంతులు బాపయ్యగారింట్లో తియ్యదోస గింజలుండాలే వాళ్లవారిగసేలోనిరుడుపూరాగ్గాసినియ్.

వీరమ్మ : ఏవోఁరా! ఆయనసలె గుబుళ్ళ మారాడు. ఏవం టాడో ఏమో.

ప్రసాద్ : ఆయనమాట ఆయనకే వుంటుంది. ఒకఅడుగేసిరా మ్మా...... అమ్మా. లేకపోతె చంద్రమ్మని పంపించే.

అమరయ్య : (వీరమ్మ కెదురై) యింకా కొంపలుపట్టుకొని తిరిగే కాడనేవుంది. తెలిరానియ్యబాక. (ప్రసాదునిజూచి) రెండో అరకెవురదయ్యా.

ప్రసాద్ : వెంకట్రాయుడిదె.

అమరయ్య : దున్నలుగదూ.

ప్రసాద్ : అయినా బాగానె బోతయ్యే!

అమరయ్య : ఏఁవేడుత్తయ్యో! మరిత్తనాలు పెట్టటానికి ఎవర్నిపిల్చా.

ప్రసాద్ : కొండయ్యని పిలిస్తినే! అడేం. ఇవ్వాళల్లా మనపన్లోనే వుంటాడు.

అమరయ్య : ఎక్కడన్నా మానెడుగింజలు దెచ్చుకునేవోణ్ణి వాణ్ణెందుకు బిల్చావురా. ఎట్టోకట్టా ఆనాలుగుగింజలు నేనే రాలిపేవాణ్ణిగా.

ప్రిసాద్ : అట్టావుండి అరకమ్మటి తిరుగుతా. మంచిపనే. మసుగులో తిరగ్గూడదన్నాడు డాక్టరు.

అమరయ్య : పొద్దుట్నుంచి తలనాదు. లే త్తేయిసిరే త్తందయ్యా.

ప్రిసాద్ : అందుక నేనా అరకమ్మట తిరుగుతానంటన్నాన్.

కొండయ్య : (వస్తూ) అమరయ్య బాబూ పదునైందా పొలం.

అమరయ్య : బుంగపోత పోస్తే పదునుగాపోటం ఏందిరా. (లోనికెళ్లాడు)

కొండయ్య : దేవుడు సల్లనిసూపే సూత్తండాడు. మడుసులుకె పుట్టింది. మాయ తెగులు. ఏంది బాబూ యీరుమల్లీ సంచులు పుచ్చుకోని పెద్దోరుసుట్టూ పదచ్చనం చేత్తన్నారంట.

ప్రిసాద్ : తిరక్క మాటల్తో వదిలిపెడతారా? పొలం! సరె గాని నువ్వు అన్నం దినొచ్చావా.

కొండయ్య : సద్ది దాగొచ్చాలె. మరేంటింకాలకం. వూళ్లో అరకలన్నీ పోతంటె.

ప్రిసాద్ : అయిందైంది. (పట్టెడ రుద్దుతున్నాడు)

(శాంత పూజ పూర్తిజేసుకుని వస్తూ పళ్ళెంలోవున్న పసుపుముద్ద కొండయ్య నోట్లోకుక్కి యింట్లోకి పరుగెత్తింది)

కొండయ్య : తు. తు. తు. చూడు బాబూ చూడు.

ప్రిసాద్ : శాంత. శాంత.

కొండయ్య : అదేంది. మల్లీ బెట్టమనా?

వీరమ్మ : (వచ్చింది) ఏందిరా యీగోల (కొండయ్యనుజూచి నవ్వింది)

శాంత : (యింట్లోనుంచి నవ్వుతూవచ్చింది)

కొండయ్య : చూడమ్మా. (అని నోరు చూపించాడు)

శాంత : పెట్టమన్నాడత్తయ్యా! మా అవ్వ అన్నంపెట్టనందంట.

కొండయ్య : అంటా. అంటా. (ప్రిసాదుతో) అబ్బాయ్ సెపు

తుండా. నాగ్గనక కోపంవచ్చిందంటె మంచోడ్ణిగాదు. ఊఁ ... ...

ప్రిసాద్ : (నవ్వుతూ మువ్వలపట్టెడ గలగలా మోగించుతూ బైటకెళ్లాడు

శాంత : (చిరునవ్వుతో సిగ్గుతో ఇంట్లోకెళ్ళింది)

అమరయ్య : (యింట్లోనుంచి పొగాకు పాయదీస్తూ వచ్చి) తుమ్మేరు దగ్గేరు పదండిరా కొండలూ, ఆ నాలుగ్గింజలూ సల్ల బూట రాలిపిరండిరా. అబ్బాయ్! ఓరబ్బాయ్.

వీరమ్మ : రామ్మ రావె యిత్తనాల్ సర్దుదాం. కొండయ్యా.

అమరయ్య : ఏవిఁరో.

ప్రిసాద్ : ఆఁ. ఆఁ. (వచ్చి) ఏవిఁటి? నాన్నా!

అమరయ్య : సూడయ్యా! చుట్టూకారుజొన్న పట్టెలే. రెండు గొర్లుదట్టంగానే పెట్టించు. పిల్లిపిసర్లు కొంచెం ఎక్కువ గానే గలుపులె. ఆఁ... పల్లులో కొచ్చాక క్రిందికీ మీదికి ఒ గొర్రుపెట్టించు గోగులపట్టె.

ప్రసాద్ : సర్లే (గబగబా బైటకెళ్లి అక్కడనుండే బిగ్గరగా) నాన్నా మరి కందో?

అమరయ్య : చారెడుసేలో పట్టెలెందుగ్గాని. సాలుకందే పెట్టించరోయ్. ఓయ్.

ప్రసాద్ : (దూరంగా) ఆఁ...ఆఁ...

కొండయ్య : (యింట్లోనుంచి యిత్తనాలుపోసిన అలుకుతట్ట నెత్తిన ఎత్తుకుని వచ్చాడు.)

అమరయ్య : అరేయ్ కొండలూ పైరెట్టుండాలో తెల్సా. కర్ర కర్రరంటకుండా అచ్చన గాయలుండట్టుండాల. (కొండయ్య వెనుక వీరమ్మ శాంత వచ్చారు.)

వీరమ్మ : అమ్మోమ్మవ్! మద్దాలే. చారెడుబియ్యం ఏయించి

యిసిరి జావగాసి మీా మావఁయ్యకి (చెప్పిముందుకు సాగుతున్నారు.)

అమరయ్య : సర్లే పద్దురూ.

అమీనా : అమరయ్యగారూ. అమరయ్యగారూ.

అమరయ్య : (వచ్చి) ఎవురూ.

అమీనా : అమరయ్యగారు మీారేనా

అమరయ్య : నేనేనండి.

అమీనా : యీా యిల్లుమీాదేనా?

అమరయ్య : మాదె. ఎందుకు?

అమీనా : ఆ అరకా మీాదేగా?

అమరయ్య : ఆఁ ఆఁ

అమీనా : (బైటకుచూచి) ఏవండి. ఆ అరకని పోనీయకండి.

కొండయ్య : సుబవాంట ఏరువాక సాగబోంతఉ నేమో...

అమీనా : సాగావులె ముందాబుట్టక్కడ పెట్టవోయ్.......

అమరయ్య : ఎందుకండి?

అమీనా : ఎందుకా ధర్మయ్యగారికి 17 వందలు బాకీవున్నందుకు

ప్రసాద్ : (అరకఆపివేయగా, యింతలోకె వచ్చాడు.) 17 వందలూ

అమరయ్య : 7వందలేనండి. ఏవఁయ్యో(శ్రీ)రంగాన్ని అడుగుతాడు.)

అమీనా : 7 వందలో 17 వందలో ముందు డిక్రీవినండయ్యా.

విజయవాడ డిస్ట్రిక్టు మునసబ్ కోర్టు వరిజనల్ సూట్ నెం. 318 of 1952వ. సంవత్సరం.

వడ్డీకాసులు ధర్మయ్య......... వాది.

డిక్రీహోల్డర్.................

ఎదిరి... నేరని అమరయ్య... ప్రతివాది.

జడ్జిమెంట్ డెటూర్.

ప్రతివాది ధర్మవరంగ్రామకాపురస్తుడు నేరని వెంకయ్య కుమార్డు అమరయ్యవల్ల వాదికి రావలసిన ప్రోనోటు బాకి 17 వందల రూపాయలున్నూ అందుపై 12% చొప్పున దావా తేదీవరకు వడ్డీయున్నూ సదరు తేదీ నుండి 6% చొప్పున దరిమిలా వడ్డీయున్నూ యీదావా ఖర్చులున్నూ మొత్తం 2083-11-9 లు. ప్రతివాది స్థిరచరాస్తులువల్ల రాబట్టవలసి యున్నది. కాబట్టి యీ దిగువ షెడ్యూలు దాఖలా స్థిరాస్తియున్నూ, యితర చరాస్తులున్నూ, వాది ఏజెంటు వాయిదాల శ్రీరంగంగారికి వప్పగించవలసినది. ఆటంకపరచే ఎడల పోలీసు సహాయంతో ప్రతివాదిని ప్రతివాది మనుషులను తొలగించుటకు అధికారము యివ్వడమైనది.

నాచేవ్రాలున్నూ కోర్టు మొహరున్నూ వేయబడినది—

ప్రసాద్ : ప్లయింట్ చేసిందీ డిక్రీ పొందిందీ మాకేం తెలియక్క ర్లేదేమండి? (వీరమ్మ కాంతకేదో చెప్పింది. కాంత బైటకి పరు గెత్తింది)

అమీనా : ఎట్లా తెలుస్తుందండి. వచ్చినోటీసులు వచ్చినట్టె తిరగొట్టిస్తే.

అమరయ్య : నోటీసులువచ్చిందెప్పుడూ తిరగొట్టించిందెప్పుడూ? ఏవయ్యా! శ్రీరంగం?

కొండయ్య : మాట్టాడవేవయ్యా అడిగేది నిన్నుగాదు.

అమీనా : ఏవిటయ్యా ఆయన్నడిగేది నిన్నడిగేది. ముందు యిల్లు ఖాళీజేసి బైటకి నడవండి.

(13)

అమరయ్య : ఎందుకు వెళ్లాలి. చస్తేఎల్లను. నాదీయిల్లూ పొలం. ఎవడబ్బా సొత్తేంగాదు.

అమీనా : నిన్నటిదాకా నీదె.

అమరయ్య : ఎప్పటికీనాదె. నే చచ్చేదాకానాదె.

అమీనా : యిప్పట్నించి ధర్మయ్యగారికి హక్కేర్పడిందయ్యా. ఇదేం అల్లాటప్పా వ్యవహారంగాదు. బుఖాయిస్తేపోను. ప్రభుత్వ వుత్తర్వు.

కొండయ్య : ఏ పెభుత్వవండి.

అమీనా : మీా ప్రభుత్వమేనయ్యా.

కొండయ్య : మాపెబుత్వమొ మారాజుల పెబుత్తమొ 7 వందలని 17 వందలుజేసి ఎవుడికొంప ఎవుడికెయ్యాలని!

అమీనా : ఆమాట ప్రభుత్వాన్ని అడగవోయ్.

కొండయ్య : యెవురితో చెప్పిజేసిందీపనిపెబుత్వం. ఎవరితో చెప్పకుండా చెయ్యకండా జవుతులు ఏలాలు అన్నీ ఆరిట్టం మీాయిట్టవేనే?

అమీనా : (తగ్గాడు.) అవన్నీ మీారు కోర్టుద్వారా రుజువుజేసుకోవాలండి. మీాకు తెలియదు; యిదిమాడ్యూటీ.

కొండయ్య : ఎద్దీనిందంటె గాటకట్టేయమంటవేనా? డూటీ అంట డూటీ.

అమీనా : యింతకి మీారనేదేమిటండీ. కదలమంటూరా?

ప్రసాద్ : అదీ ఒక నేరమేగా.

అమరయ్య : నేరం. నా యింట్లోనేనుంటం నేరం......కాదు.

ప్రసాద్ : అవున్నాన్నా మనింట్లోమనం వుండటం నేరం చమటోడ్చి పండించటం నేరం పనిచూపించ మనటం నేరం పిల్లాజల్లా పచ్చపచ్చగా బ్రతికేది నేరం.

అమరయ్య : కాదు. కాదు. నేరంకానేకాదు. నాదీ యీాయిల్లు ఏమైనా నాదెయిల్లు.

ప్రసాద్ : నాన్నా. యిపుడీ యీాయన్ని కాదంటె పోలీసులు వస్తారు. పరువు మర్యాద పాటించకుండానే బలవంతాన బజార్లో కీడుస్తారు, అదేవంటె ఏమైనాజేస్తారు.

అమీనా : అమరయ్యగారూ.

అమరయ్య : ఏంబాబూ! మీారూ పిల్లాజల్లాగలోరేగా మాకుంది ఆరెండకరాలు యీా కొంపేనే. యీాకాస్తబోతె మేమెట్టాబతికేట్టు చెప్పండి. న్యాయం యిసారిచ్చండి.

అమీనా : నాన్యాయం ఎవరిక్కావాలి చెప్పండి. చెప్పింది. చెయ్యటమెగాని చెప్పిచేయించే అధికారం మాకులేదు.

ప్రసాద్ : అవును లేదు. మీాకేగాదు. దున్నిపండించి దేశానికి జీవంపోసే ఆసాములకే లేదు. ఒక్కసారి ప్రభువైన వాడు. ఎంతక్రూరంగా ప్రవర్తించినా ఎంతదుర్మార్గంగా పాలించినా ఎన్నిదౌర్జన్యాలు చేయించినా వాడిని గద్దె నుంచి దొర్లించే అధికారం ప్రజలకే లేకుండా పోయింది. ఎపుడు ఎందుకులేకుండా పోయిందో ఎవరికీ తెలియదు.

శ్రీరంగం : ఏవిటండీ యీా సోది.

అమరయ్య : ఏందిరా. సోదంటరా. మాసోవనీకు సోదైందంటరా. (మీాదికెళ్ళాడు)

అమీనా : అమరయ్యగారూ.

కొండయ్య : తన్నూ యీాడబ్బ ఎవడడ్డంవస్తాడో చూద్దాం.

దాసు : (తీవ్రంగా వస్తూనే) దొంగనోట్లు పుట్టించి ఎవుడిదీపం తీద్దాం అనుకున్నావురా.(కొట్టబోయాడు. ప్రసాద్ ఆపాడు.)

ప్రసాద్ : దానూ! - ఆగు...

దాసు : ఆగండి. యీడిప్రాణాలు తియ్యాలి.

ప్రసాద్ : దాసూ. (పెద్దగాఅని వాటేసుకున్నాడు)

అమీనా : చూడండి. అన్ని ఆర్డర్లు దీసుకొచ్చిందాయన. అమలు జరపటానికొచ్చిన మాదేముంది చెప్పండి. మేంగాదంటె మరొకరైనా వచ్చేదేగా. మీరేదన్నా అడగదల్చుకుంటె ఆ ధర్మయ్యగార్ని అడగటంమంచిది.

అమరయ్య : అవును. ఆయన్నే అడుగుతా. ఆయనకాళ్లే పట్టుకుంటా. నాకింత కూడుబెట్టమని ఏడుకుంటా (గబగబా బైటకెళ్ళుతున్నాడు. అమరయ్యతోబాటు)

ప్రసాద్ : నాన్నా!

వీరమ్మ : నాయనా.

ప్రసాద్ : (తెరలో) దాసూ. (అందరూ బైటకెళ్ళారు)

అమీనా : ఉఁ... ఉఁ... యింటికి తాళం బెట్టండి శ్రీరంగం గారూ.

శ్రీరంగం : (నవ్వుతూ)

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచదుష్కృతాం.
ధర్మసంస్థాపనార్థాయ
సమ్భవామి యుగే యుగే.

తాళంచెవి జేబులోనుండి బైటకు తీశాడు.

(తెర)

# 7-వ రంగం

## ధర్మయ్యగారి యిల్లు

(ధర్మయ్య అటూయిటూ తిరుగుతూ. బైటద్వారమువంక జూచి వచ్చి సోఫాలో కూర్చుని పేపరుచదువుతున్నాడు.)

అమరయ్య : (వస్తూనే) బాబూ! బాబూ! (కాళ్ళమీద పడి) వకే డుగాదు రెండేళ్లుగాదు. 14 ఏళ్ళనుంచి నీ పాలం జేస్తన్నా. నెత్తురు మాంసాలొడకట్టుకున్నా. పొల్లా బీళ్లుదున్నా. పండినా పండకపోయినా కొల్చిచ్చా. బకాయిలకు వడ్డీలు; ఆ వడ్డీలకు వడ్డీలు చెల్లించా. తిన్నానో తిన్లేదో దేవుడికే తెలియాలి.

ధర్మయ్య : నోర్ ముయ్. చిలక్కి చెప్పినట్టు చెప్పా. నాకెదు ర్రావద్దని. విన్నారా?

అమర : నన్నన్నాయంసేయకండి.నీమాటకాదన్నదెప్పుడూలేదు నా నోటికాడ కూడుదీయకండి. సాటి సంసారిని. పూలు అమ్మినూళ్లో కట్టైలమ్ముకోలేను.బాబూ. బతికించ్చండి.

ధర్మయ్య : (మెల్లగా అవతలకెళుతూ) సాటిసంసార్లు. పండంటిఆసా ములు. (నవ్వాడు)

ప్రసాద్ : నాన్నా! (వుసిగావచ్చి తండ్రినిలేవదీస్తున్నాడు. ఆ వెనుకే కొండయ్య, వీరమ్మ, చలమయ్య, జ్ఞానయ్య వచ్చారు) నాన్నా! యిప్పటికీవూళ్లో మనం ఎన్నోవాళ్ళం నాన్నా.

అమరయ్య : అవును బాబూ! యిన్నాళ్లనుంచి నీ మాటనమ్మ లేకపొయ్యాను. నీకన్నాయంజేశాను. నిన్ను అన్నిం దాల సన్నాసిని జేశాను. నిలవనీడ నా అని చెప్పుకునేం దుకు గోరెడంత నేలగూడా లేకండా జేశానంటూ అయ్యో (కావిలించుకుని ఏడుస్తున్నాడు. అందరికి కళ్ళల్లో నీరుదిగింది.)

ప్రసాద్ : పోతేపోయింది. యిప్పటికైనా నిజం తెల్సుకున్నావ్. అదేపదివేలు.

అమరయ్య : ఆఁ! ఎందుకుబాబూ. బమ్మాళ్లారల్లేవున్ననీన త్తిన పిడికెడు బియ్యం పోసేబదులు బండఁత సంసారాన్నే శానంటరా అయ్యా నీకెందుకురా యీాయయ్య. యింకెందుకురా. (వీరమ్మ ఏడుస్తూంది.)

ప్రసాద్ : నాన్నా!

అమరయ్య : న్నాన్న.

ధర్మయ్య : ఏమిటి ఏడుపు. బైటికినడుస్తారా? గెంటేంచాలా.

అమరయ్య : నాకెందుకయ్యా యీా బతుకు నాపొలంతోబాటు నన్నుగూడా. ఎత్తుకుపోగూడదయ్యా దేవుడు,

ధర్మయ్య : చెప్పేదిమీాకే

కొండయ్య : సెబుతారండి. ఎందుకుసెప్పరూ. మీారెప్పుడూ సెబుతానేవుంటారు. మాకేబుద్ధిలేదు. యహేపదండి. నెవిలికంటికి నీరుగారితే యాటగాడికి ముద్దంట.

ధర్మయ్య : అరేయ్

ప్రసాద్ : అమ్మా రా! (ముందుకు సాగాడు)

వీరమ్మ : ఎక్కడికెళ్దామయ్యా ఎవురివంచన తలదాచుకుందాము రా. మమ్మల్నేగంగలో కలుపుతావురా. మనం ఎట్టా బతుకుతాంరా అయ్యా!

శాంత : బాబూ! బాబూ! పొలం అంతా రాడీలమయమై పోయింది. అరకలు ఆపేశారు.

ప్రసాద్ : ఆఁ... అరకలాపేశారా?

శాంత : ఆపటమేగాదు. అందినవాళ్లని అందినట్టు లాఠీలతో

చావబాత్తున్నారు. వూరంతా పొలంఅంతా అల్లకల్లో లంగా వుంది.

కొండయ్య : లేవండి. రోజూ యిట్టా జచ్చేకంటె బతకటం కోసం పోట్టాడదాం. అంతగా సావాల్సొత్తె అంతా కట్టగట్టుకొని ఆ కౌలు పొలంలోనే సద్దాం. పదండి.

ధర్మయ : ఆగండి.

ప్రసాద్ : వీల్లేదు. ఏ పొలంకోసం యిన్నేళ్లుగా కోర్టులుచుట్టూ తిరుగుతున్నామో. ఏపొలంకోసం నాకుటుంబాని కీ గతు లొచ్చాయో ఏ పొలంకోసం దేశంలో చావుబ్రతు కుల పోరాటం సాగుతుందో ఏ పొలంకోసం వందల మంది విప్లవయోధులు తమ పవిత్రమైన ప్రాణాల బలిపెట్టారో ఆ పొలంకోసం ఆ కౌలు పొలంకోసం ప్రాణాలకు తెగిస్తాం. మీరుగాదు. మిమ్ములను సృష్టిం చినవాళ్లువచ్చినా ఆగేదిలేదు. పదండి.

ధర్మయ్య : నిలు. కాలుకదిపారంటె కాల్చేస్తా. (తుపాకి అందుకు న్నాడు)

అమరయ్య : కాలువు. నన్ను కాలువు. నేనూ చావాల్సింది. మూడుదమ్మిడీలు చెయ్యని నేను నీసాటోణ్ణిగా విర్రవీగి నందుకు కాల్చు. కులంఅని, తలంఅని లేనిగొప్పకోసం పాకులాడినందుకు కానియ్. పదుగురిమాట పాటించక నీ అండతో లోకాన్నేలదామని కలలుగన్న యీణ్ణి, యీణ్ణిగాల్చు. అన్యాయంగా నాపొలం [illegible]ంకుంటున్నా వుగా. నాప్రాణాలుగూడా తీస్కో.

ధర్మయ్య : అరేయ్! (అమరయ్యను తోసాడు. అమరయ్య పడిపో యాడు)

అందరూ : అరేయ్! (ధర్మయ్యపై కురికారు)

సర్కిల్ : ఆగండి. మీ యిష్టమొచ్చినట్లు చెలాయిద్దామను కున్నారా! మేమంతా ఎందుకున్నామనుకున్నారు (ధర్మయ్య చేతిలో తుపాకి అందుకుని వ్యాన్‌లో పెట్టమని లోని కొస్తోడు)

కొండయ్య : అలగా జనాన్ని అదుపులో పెట్టేందుకున్నారు. కలిగిన మారాజుల్ని కాపాట్టానికుండారు.

ప్రసాద్ : ఆపటానికీ ఆగటానికి హద్దంటూ వుంది. మాగొంతు మీద కత్తిబెట్టి... (సర్కిల్ ఉరిమి ప్రసాదును చూచాడు)

ధర్మయ్య : నాకొంప మీదకి దొమ్మీకొచ్చి.

అమరయ్య : మేమా?

సర్కిల్ : సైలెన్స్.

ప్రసాద్ : దొమ్మీ! ఏ దొంగల్ని యిరవై వండలు జేసి యిల్లూ పొలం కాజేసింది. దొమ్మీగాదు. వూరంతా కడుపులు మాడ్చుకుని కాళ్లరిగేట్లు కోర్టులచూట్టూ తిరిగి తెచ్చు కున్న పర్మిషన్ను... (పర్మిషన్ తీశాడు జేబులోనుంచి)

ధర్మయ్య : కొంపలమీద దౌర్జన్యం చెయ్యమని ఎవడిచ్చాడ్రా!

సర్కిల్ : దౌర్జన్యం వాళ్లదెగాదు. (ప్రసాదు చేతిలోని కోర్టు పర్మి షన్ కాగితం తీసుకుని చదువుతాడు)

ధర్మయ్య : మాదంటారా?

ప్రసాద్ : కాదంటారా.

అమరయ్య : ఏ మొకంబెట్టుకుని ఛీ. పెద్దమడిశంట పెద్దమడిశి.

ధర్మయ్య : మేమేం పెద్దమనుషులం లేవోయ్.

ప్రసాద్ : రౌడీలతో వూరును నాశనం జేయించాలన్నా చట్ట బద్దమైన కోర్టుపర్మిషన్ను కాలదన్నాలన్నా అదేం అంటే

తుపాకులు పేల్పించాలన్నా పెద్దమనుషులకుగాక పేద వాళ్లకేం చేతవుతుంది.

సర్కిల్ : ఊఁ...

ధర్మయ్య : చూచారా

సర్కిల్ : చూచాను. అంతా అర్థంజేసుకున్నానుగూడా.

ధర్మయ్య:అయితే చెయ్యండి. వీళ్లనియిప్పుడె యిక్కడెఅరెస్టు...

కొండయ్య:చెయ్యండి. అరెస్టుగాదు. నిలబెట్టి కాల్చిపారెయ్యండి ఒప్పుకుంటాం. నేరంవున్నచోట దండన జరగాల్సిందే.

ధర్మయ్య : జరిగితీరాల్సిందే.

కొండయ్య : మా శిరసులు కత్తిరించుకుపోయినాసరె అన్యాయాన్నిక అంగీకరించం. చెయ్యండి. మానేరం ఏందో రుజువుచెయ్యండి. (పైపంచ నెత్తికి చుట్టాడు)

(అందరూ పంచలు పైకి కడుతున్నారు సర్కిల్ అందరినీ చూచాడు బిత్తరపోయాడు)

ధర్మయ్య : సందేహించకండి.

సర్కిల్ : లేదు. సందేహాలకి సమాధానాలకి యికతావులేదు.

ధర్మయ్య : సావకాశంగూడా లేదండీ.

సర్కిల్ : అవును లేదు.అందుకే లా అండ్ ఆర్డరును వ్యతిరేకించి ఆరమ్సు ఆక్టును అతిక్రమించి శాంతిభద్రతలకు భంగకరంగా ప్రవర్తించే ... వారిని ...

ధర్మయ్య : ఆఁ! శాంతిభద్రతల పేరుతో నా భూమిని శాశ్వతంగా వీళ్ళకు ధారబోస్తారా ?

సర్కిల్ : లేదు.

ధర్మయ్య : మరి...

సర్కిల్ : నాకలాంటి అధికారాలేవీ లేవుకూడా. నేననేది ఒక్కటే. సాగుచేసుకునేందుకు ఆసాములకు కోర్టుపర్మిషన్ వుందంటున్నా దాన్ని కాదనటానికి మీకు నాకు ఎవ్వరికీ ఏవిధమైన అధికారము లేదంటున్నా, అంతే.

ధర్మయ్య : అంతేనంటారా?

సర్కిల్ : అంతే. ఆభూమిని శాశ్వతంగా మీక్రిందే వుంచుతుందో కౌలుదార్లకు రక్షణే కల్గిస్తుందో అన్నిహక్కులతో కౌలుదార్లే అనుభవించేట్టు చట్టాలే ప్యాస్ చేస్తుందో ఆలోచించి నిర్ణయించి అమలుకు పెట్టవలసింది ప్రభుత్వం.

ధర్మయ్య : ఊఁ.........

సర్కిల్ : ఆరమ్ము ఆక్టు అతిక్రమణక్రింద, కోర్టుధిక్కరణ నేరం క్రింద మిమ్మల్ని. యిప్పుడు అరెష్టుజేస్తున్నాను. "యు ఆర్ అండర్ అరెష్టు" (ఒకర్నొకరు తీవ్రంగాచూచుకున్నారు.)

శ్రీరంగం : అవునండి. అరెష్టు చెయ్యాల్సిందె. లేకపోతే వూరు బ్రతికేట్టులేదు.

సర్కిల్ : వారితోపాటు మీరుగూడా నడవండి.

శ్రీరంగం : చిత్తం.

సర్కిల్ : యీ చిత్తంతోనె వూళ్లకి వూళ్లు చిత్తయిపోతున్నాయి. నడవండి.(శ్రీరంగంయింట్లోకెళ్లుతున్నాడు.) శ్రీరంగంగారూ అటుగాదు. యిటూ. బైటకి. ఏ 444 ఫోర్ డబల్‌ఫోర్

తెరలో : సార్.

సర్కిల్ : వీరిద్దర్నీ వాన్ ఎక్కించండి.

శ్రీరంగం : వూరును కనిపెట్టుకుబ్రతికే నాదేముందండి.

అమరయ్య : ఓరినీ తల్లి కడుపుకాలగదరా!

కొండయ్య : అంది తెజుట్టు అందకపో తెకాళ్లు.

దాసు : అంతేగా మరి.

సర్కిల్ : మర్యాదగా వస్తారా. బేడీలు వేయించి తీసికెళ్ల మంటారా? (దర్మయ్య శ్రీరంగం ఒకరి మొకాలొకరు చూచుకు న్నారు ముందుకు సాగిపోతున్నారు)

తెరలో :
సీతులను వల్లించి నెత్తిన
చేతులిడి నిరుపేద సాదల
బాధలకు బంధించుటది – నీ
బ్రతుకు దెరువుకు బంధికాన ॥నీతి॥

(సర్కిల్, ధర్మయ్య, శ్రీరంగం వెళ్లిపోయారు)

ప్రసాద్ : చూచావా కొండయన్నా. అంతా ఒక్కమాట మీాద వున్నందువల్ల ఏంజరిగిందో.

కొండయ్య : అవును బాబూ. ఎంటితో ఏనుగును కట్టొచ్చని వూరికె అన్నారా?

దాసు : వూరంతా ఒక్కమాటమీాదుంటె దానిదేవుంది బాబూ. మేడి గుఱు బెట్టమంటె పెట్టదూ!

అమరయ్య : ఏంఅయ్యా. యిక మనపొలం మనకుండేట్టేగా.

కొండయ్య : నీపొలం యాడికిపోద్దే. యీాపులుమోావులుమీాద కొండంత ధర్మయ్యా సీరంగంవుంటే!

అమరయ్య : ఊఁ... ఏడిశావ్ లేవోయ్. (అందరు నవ్వుతున్నారు)

ప్రసాద్ : సరిలెవదండి.

కొండయ్య : ఆఁ ఆఁ... వూరంతా మనకోసం కాసుకూకసో నుండాలి. వదండి.

ప్రసాద్ : అమ్మా !

వీరమ్మ : నాదేవుందిరా నాయనా. యీపీడా విరగడైంది. నా దిగులుదీరింది.

ప్రసాద్ : (నవ్వి) అప్పుడేనా. కాదమ్మా. యీ భూస్వామిక విధానం రద్దైదున్నేవాడికి భూమ్మీద శాశ్వతహక్కు ఏర్పడి భూమిని అమ్మటం కొనటం అనే నీచపద్ధతి అంతమయ్యేదాక ఆసామికి యీ అగచాట్లు వుంటూనే వుంటాయమ్మా! ఆనాడే అవన్నీజరిగిన్నాడే ఆనందం ఆసామికి పదండి.

తెరలో : — పాట —

లేండోయ్ లేలెండోయ్.
రారండోయ్- కదలండోయ్...
నడవండోయ్- రైతులుకూలీల్.
చిటపట చినుకులు
ఉరుములు- మెరుపులు
మెరిసె మెరిసె- మెరిసె మెరిసె
తొలకరి తల్లికి- పొంగలి- పులగం
తొలిమ్రొక్కులిడన్- లెండోయ్-
గణగణ గణగణ-
గంటలు మువ్వలు
మ్రోగె మ్రోగె- మ్రోగె మ్రోగె
పరుగున అందరు
ములుగర్రలతో
అరకలమర్చుక- లెండోయ్-

సంపూర్ణం

—(తెర)—






# చదవండి!

## నగారా ప్రచురణలు

| | |
|---|---|
| భార్యా భర్తల మధ్య | 0—8—0 |
| ఆకాశ దీపాలు | 1—0—0 |
| ఉక్కు-పాదం | 4—0—0 |
| విప్లవ సమిధలు | 0—10—0 |
| కైమెంత | 1—0—0 |
| ఆకలి | 2—12—0 |



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B169 |
| పుస్తకం పేరు | ఆ సారపు |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,IV, [illegible], BCI |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | REHANA |
| స్కాన్ చేసినది | mounika |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |